శ్రీ

# మా నా ప మా న నా ట క ము.



ఇది

బళ్ళారిలో వకీలుగానుండి

కే. శే. బ్రహ్మశ్రీ॥ కోలాచలం శ్రీనివాసరావుగారిచే

రచియింపఁబడినది.

వారి జేష్ఠపుత్రులగు కె. శత్రుఘ్నరావుచేఁ

ప్రకటింపఁబడియె.



మొదటికూర్పు.





బళ్ళారి.

ఆంధ్రముద్రాక్షరశాలయందు

ము ద్రి త ము.

1925.



వెల రు. 1—0—0

# పీఠిక.

ఇటీవల బళ్లారి పురంబునకువచ్చిన పునాకంపెనీలు రెంటిలో " కేశవ
గంధర్వకంపెనీ " వారు " రాక్షసీమహత్వాకాంక్ష " యను గంభీరనాటకము
(***Tragedy***) నాడి ప్రేక్షకులను మెప్పించిరి. ఆనాటకమును నేనాంధ్రీకరించి పీఠి
లో " ఖేదాంత " నాటకమనునది యన్వర్థనామము కాదనియును దాని పేరు "గంభీర"
నాటకమనియుం బడవలెననియు వ్రాసినాను అటులనుటకుఁ గలకారణమ్ములు
నైతము వ్రాసినాను. మఱియొక " బాలగంధర్వ " యను కంపెనీవారు " మా
నాపమాన " మనెడి నాటకమాడి జనులను హర్షింపఁజేసిరి. అచటఁగూడినరెండు
వేల జనులలోఁ బదుగురికిఁదప్ప మిగతవారికి వారాడిన యొకమాటయైనను నర్థము
గాదాయెను. బాలగంధర్వుఁడు పాడుచున్నపుడు మాత్రము ప్రతి ప్రేక్షకుఁడు
నెలుఁగుగొండబలెఁ దలయూచుచు బాణీవాదమునను వేషధారినిఁబ్రోత్సాహ
పఱచుచుండెనుగాని కథయేమయినదియు ననేకులకుఁ దెలియదాయెను. అట్టియవ
స్థచే నేనును బాధపడితిని. పిదపమహారాష్ట్రభాష నొకనెలదినములు తగినంత
వఱకు నభ్యసించి ప్రారంభమున " రాక్షసీమహత్వాకాంక్ష " యనునాటకము
నాంధ్రీకరించితిని. నాటకము కథారూపకముగనుండినందున నాంధ్రీకరించుపని
నాకుఁగష్టమనిపింపలేదు. ఆనాటకమునందు హెచ్చుభాగము సంస్కృతశబ్దము
లును గొంతభాగము మనదేశములో నలవాటుగనున్నమహారాష్ట్రభాషయును
నుండెను. ఈమానాపమాన నాటకము హెచ్చుగ దేశీ భాషసంకలితముగనున్నది.
దేశీభాషయనగా పునాలోను నచటికిఁజుట్టుముట్టుఁగల దేశములలో వాడుక
గనుండు ప్రాకృతభవవికారములగు తద్భవశబ్దములు. కావున నీనాటకమాంధ్రీక
రింపనాకుఁ గష్టమాయెను. పైఁగానిది గృహకృత్యసాంబంధిక మోదాంతనాటక
మైనందున **Domestic Drama** సాధారణముగనిండ్లలో నాడువారును మగ
వారును మాటలాడురీతిగ భాషమారినందున, నాచిక్కులఁదెలియుట కష్టమాయె
ను. అయినను దైవానుగ్రహమువల్లఁబట్టినపట్టువదలక యథాశక్తిన్యాయముగ

నాంధ్రీకరించితిని.

[2]. ఇదిమోదాంతనాటకమని నేనుడివెదను. మోదాంతనాటకము లెటు లుద్భవించినదియు సూక్ష్మముగనిందు వ్రాయఁబూనితిని. ప్రారంభమునఁబుట్టినవి గంభీరనాటకములేను. విద్వాంసులును జదువుకొని నాగరికతగల యితరులును గంభీరనాటకములందే యాసక్తులైయుండ గ్రీసు. దేశములో నిపుడు 2500 సంవత్సరముల క్రిందట థెస్పిస్సను పండితుఁడు సారాయి దైవమును (***Bacchus***) గుఱించికొన్ని యశ్లీములగు పాటలు నిర్మించి వేషధారులచే వీథి వీథిని నాడింపఁదొడఁగెను. మోటుజనులకు మానసాహ్లాదములుగ నుండసాగెను. అట్టిజనులువాని నేకోరసాగిరి. పిదపవచ్చిన పండితులందులోని యశ్లీలము విశేషముగఁ దొలఁగించిరి. అవియే మోదాంత నాటకములాయెను. ఈమోదాంతనాటకవృక్షమునకున నేక శాఖలేర్పడెను. ముఖ్యముగ (1) సంఘసాంబంధికనాటకము. [***Social drama***]

(2) గృహకృత్య సాంబంధికనాటకము ( ***Domestic drama*** )

" షేక్స్పియ " "రుకాలమున గంభీరనాటకము లెటుతలయెత్తెనో యదేరీతిగ " బెన్ జాన్సన్ " యనుకవి మోదాంత నాటకములకుఁ గలశమెత్తెను. ఈవిషయము నాచే వ్రాయఁబడిన " ***The Dramatic History of the World*** " చూడనగును.

[3]. యూరోపియన్ భాషలలోఁ చేరందిన మోదాంత నాటకములు విశేషముగ నేఁ జదివినాను. వానిలో దేనికిని నీ " మానాపమాన " నాటకము తలవంచునదికాదు. అచట నచట వన్నె హెచ్చింపఁజేసినదనియే నాతాత్పర్యము. అడిసన్‌గారి " ***The Rivals*** " " ***The School of Scandle*** " యనునాటకములందుఁగల సంభాషణ మతిరమ్యమని పండితులతాత్పర్యము. ప్రస్తుత నాటక సంభాషణమతిస్తుత్యముగనున్నది.

[4]. ముందువ్రాయుమాటలు నాకు నైతమన్వయించును. గావున నాం

థ నాటక కవులెవరును నాపైఁగినుక వహింపవలదు. ఆంధ్ర నాటక కవులనేకులు తామువ్రాసిన నాటకములు తామే చదివి మెచ్చుచుఁ దమ కాళ్లకుఁదామే నమస్కరించికొని శతాయువని దీవించికొనువారుగ నున్నవారు. ఇతర దేశస్థుల గ్రంథములను జూడరు చదువరు. అందులోనుండు స్వారస్యమును గ్రహింపరు. అటువలెనే తామొనరింపయత్నింపరు. ఇట్లయిన నాటకభాషాభివృద్ధి యెటులగును? గంభీరనాటకములలో భాషయెటులుండవలెను మోదాంతనాటక భాషయెటులుండవలెనను తారతమ్యమెటు దెలియవచ్చును?

[5]. శౌర్యముస్తుత్యమా ద్రవ్యముస్తుత్యమా యనువిషయమే యితివృత్తమునకు బీజముగనుంచికొని యింతటిమోదాంతనాటకమును గష్టపడి రచించి కీర్తినిఁగాంచి యితరులకు మార్గదర్శకులైన మ॥ రా॥ రా॥ శ్రీ. కృష్ణాజి ప్రభాకర్ ఖాడీల్కరుగారికి నావందనములర్పించుచు నింతటితో నీయుపోద్ఘాతమును ముగించు.

బళ్లారి
30.10.16

విధేయుఁడు.
కోలాచలం శ్రీనివాసరావు.

# THE DRAMA "MANAPAMANA"

## ARGUMENT.

### ACT I.

Bhamini the Heroine makes up her mind to marry only a Scion of a rich noble family, (a Srimanth) although it is her father's intention that she should marry the Hero, the valiant but poor Dhyryadhar, the Commander.

This desire of Bhamini is fully supported and encouraged by her elder sister Akkasaheba.

Akka's husband Vilasdhar a Jahagirdar plans the idea of noble Bhamini to think favourably of marrying his friend the rich king Lakshmidhar a boastful cowardly fool instead ofthe valiant Comamander Dhyryadhar.

Bhamini's father Baba Sahib anxious of guarding her well-fare, intends to marry her to Dhyryadhar and sends for him for the marriage from the Cantonment. Dhyryadhar comes in response to the invitation but Bhamini insults him by refusing to marry him.

### ACT II.

Baba Sahib resents this indirect action of Bhamini and seriously advises her to regain the hand of Dhyryadhar by living and moving about Dhyryadhar's camp for some time. Accordingly Bhamini under the name of "Vanamala" lives incognito as a poor girl in the bungalow of her friend Kusuma, close by the Cantonment. These circumstances are narrated to Vilasdhar by his servant Vinoda.

In her ramblings in the camp Bhamini was hearing constantly the talk of the greatness and bravery of Dhyryadhar, with the result that

her attention was drawn only towards courage, bravery and such like qualities and her inclination to-wards high birth and riches began to wane. On this Vilasdhar tries to make Lakshmidhar a valourous man.

Dhyryadhar and Bhamini (Vanamala) meet for the first time and love is kindled in them both.

Vilasdhar's plan becomes frustrated owing to the ridiculous mock valour of Lakshmidhar.

Dhyryadhar rescues Bhamini (Vanamala) from the clutches of thieves which greatly augments her love towards valour and chivalry.

ACT III.

Vilasdhar finding his plan frustrated instigates his wife to coerce Baba Sahib to get Bhamini married to Lakshmidhar.

Lakshmidhar's jestful soliloquy on the coquettry and jewellery of Srimanths.

Bhamini discusses her iove towards Dhyryadhar with Kusuma. The Commander Dhyryadhar having returned victorious in the battle is rewarded with a Jahagir and proceeds to meet BabaSahib. Baba Sahib requests Dhyryadhar to forget the insult given to him by Bhamini and forgive her by marrying her. But Dhyryadhar discards the request by expressing his unwillingness to marry Bhamini and declares his determination of marrying only a poor but accomplished girl and departs.

The determination of Dhyryadhar scatters all hopes of Bhamini. She determines to remain incognito again as the poor girl Vanamala and thus win the love of Dhyryadhar.

ACT IV.

Vanamala enters the service of Dhyryadhar as a servant girl. She feels that Dhyryadhar has begun to love her and desires to put it to test. With this object she gives leave to all the servants of Dhyryadhar and sends them away.

Dhyryadhar and Vanamala express love towards each other.

But still the intention of the jealous Vilasdhar was to see Bhamini married only to Lakshmidhar his friend. So Lakshmidhar and Vilasdhar conspire to estrange the love of Dhyryadhar towards Vanamala.

## ACT V.

The poor Vanamala reveals herself to be the high bred and noble Bhamini and garlands Dhyryadhar in token of love.

Dhyryadhar accepts her hand in marriage.

## MANGALAM.

## *Dramatic Personae.*

Dhyryadhar:—The Commander of forces.

Babasahib:—Bhamini's father - Srimanth - Jahagirdar.

Laxmidhar:—A rich noble and boasting Jahagirdar, and Dhyryadhar's rival for the hand of Bhamini.

Vilasadhar:—Akka's husband.

Vinoda:—Servant.

Bhamini:—The daughter of Babasahib - A Srimanth and Jahgirdar.

Vanamala:—Bhamini's assumed name as a poor girl.

Kusuma:—Bhamini's friend.

Akkasahiba or Akka - The elder sister of Bhamini.

### పురుషపాత్రలు

ధైర్యధర:— సేనాధిపతి

లక్ష్మీధర:— ఒకగొప్ప జాగీరుదారుడు. ధైర్యధరుని ద్వేషి. భామినిని మోహించియుండెను

విలాసధర:— అక్క భర్త

బాబాసాబు:— భామినితండ్రి. శ్రీమంతకుటుంబమునకు చేరినగొప్పజాగీరుదారుడు.

వినోద:— సేవకుడు

శీలధర:— ధైర్యధరుని స్నేహితుడు. సేనకు చేరినవాడు.

### స్త్రీపాత్రలు.

అక్కాసాబు:— భామినిఅక్క.

భామిని (వనమాల):— యనిఒకబీదదానివలె పేరుపెట్టుకొనియుండెను. బాబాసాబుకూతురు.

కుసుమ:— భామినిచెలికత్తె.

కమల:— చెలికత్తె.



# మానాపమాన నాటకము.

నాంది - సూత్రధారుఁడు - పారిపార్శ్వకుఁడు.

సూత్ర:--చం. నటవర సూత్రధార నటనాట్యవినోదకరా, చిదంబరా,
కుటిలనిశాటవంశవనకోటికుఠార, భుజంగహార సం
కటపరిహార, శూలధర, కమ్రశరీర, శివంకరా, హరా,
పటుతరసంయమీశ్వర, శుభమ్ములఁ బ్రోవర ప్రేక్షకాళినిన్.

ఉ. మోదముఁ బ్రేమతో నొసఁగి ముజ్జగముల్మనఁ జూచి, కావరా,
ఖేదము లెల్లవారి యెడఁ గీటడఁగింపర; మానసంబునన్,
బాదుగనిల్చి నీనుతులఁ బాడఁగఁ జేయర, పార్వతీశ్వరా,
మేదురమౌ శుభమ్ములను, మేధయు, నాయువు నిచ్చి ప్రోవరా.

సూత్ర:— పారిపార్శ్వకా! పరమేశ్వరుని ధ్యానమింతయు, చాలును. ఈ పూజాపాత్రలను లోనికిఁ దీసికొనిపోయి పెట్టి దానిని నిచ్చటికిఁ బంపుము.

పారిపా:— మహారాజా! నాటకప్రారంభమున మీరెప్పుడును నిట్టియాజ్ఞలిత్తురు. సుజ్ఞుఁడను తమసేవకుఁడు తమకు నావిషయమున మతులఁ బలుకుశ్రమ పలుమాఱియ్యఁగూడదనియెంచి నేనిచటికి వచ్చుసమయముననే, యమ్మగారినిఁ జూచి "అమ్మగారూ! ఈశస్తవనము ముగిసియు ముగియక మునుపే మీరిచటికివచ్చు ప్రయత్నము సేయుఁడీ" యని విన్నవించితిని.

సూత్ర:— బాగుచేసితివి. నేఁడుత్వరపడుటయు మంచిది. ప్రారంభముననే నీవుత్వరపడినది మేలాయెను. అయినను నదియింకను రాకయున్నదేమో కదా?

పారిపా:— వారురారని నాకుఁ దోఁచుచున్నది. అమ్మగారప్పటినుండియు సౌమ్యులకుఁగాను గోపమున నున్నవారు. నేనువినయముగఁ బ్రార్థించినపుడు వారు చెప్పినదేమన.

(యవనికలో:— నేనురాను. రానని ఖండితముగఁ జెప్పుచున్నాను)

సూత్ర:— నిజము. అదినిందు కోపనగఁ దోఁచుచున్నది. నేనేపోయి దానినిఁ బ్రార్థింపకయున్న దాని కోపమునకు శాంతిగలుగదు.

(నిష్క్రమింతురు.)

( మహిషాసురమర్దనీ దేవాలయము. భామిని, కుసుమ ప్రవేశము )

భామిని:— నేనురాను. రానని ఖండితముగఁ జెప్పుచున్నాను. ఇదియేమే, కుసుమా నీనవ్వులాటలు? నేనచటికిరానని చెప్పినను మరల రారమ్మని నీవునన్ను బాధించుచున్నావే.

కుసుమ:— భామినీ! నీవేలయిట్లుఁ జేయుచున్నావే? ఆలస్యమునకు దారేమి? అదె చూడుమా సూర్యుఁడస్తాద్రికిఁజనెను. బాబాసాహేబుగారు చెప్పిరిగదా "దీపమంటించియు నంటింపక మున్నే సేనాపతియైన ధైర్యధరుఁగా రుత్సవముతో నచటికివచ్చెదరు. అంతకుఁబూర్వమే భామినిని, శోభించులాగు సింగరించుకొని సిద్ధపడియుండు లాగునఁ జేయుము" అని తెలిపియుండిరి. ఏమే, నీకు ధైర్యధరునితో లగ్నమగును. పెండ్లికొడుకు వచ్చుసమయమున నీవిట్లు కినుకవహించితివి! నీకీనడత శోభించునా?

భామిని:— శోభింపకున్న నేమాయెను? ధైర్యధరుఁడు పరాక్రమవంతుఁడైనను, సేనాపతియైనను, నా తండ్రికంటెను దరిద్రుఁడు కాఁడా? పట్టిపరాక్రమము పైననే యాఁడువారి మనము నిలుచునా? మానసాపేక్షను టూగ్గీకరించు నన్నినగలు వేయు పెండ్లికొడుకును వాఁడువారు ప్రేమింతురు. అదిక్కునఁ జూడుమా రజనిని బరాక్రమవంతుఁడైన సూర్యునిని. ఆసూర్యుఁడరక్తుఁడయిన కారణంబున, ఆరజని వానిని దూరమున ద్రోయుచున్నది.

చ. అదెగను, సూర్యుఁడస్తగిరి యావలఁ బోయెనిరస్తతేజుఁడై,
సుదతిసురక్తయై రజని సూర్యునిఁ జూడక తారహారసం
పదమున దీటుకే నిశాకరుని, సంగతి సౌఖ్యములందఁ గోరెడిన్
మదిఁగనుసీవు; మానినికి మాన్యుఁడు భర్తయెవండొ నెమ్మదిన్.

చెలీ! ఆధైర్యధరుఁడు రానిమ్ము. ఆసూర్యుని గతియు వానికిని వచ్చులాగొనరింపక నేనుండఁ బోనుగాను.

కుసుమ:— భామినీ! ఇట్టి పిచ్చి మాటలాడకు. నా భామిని సంపూర్ణజ్ఞానధారకయని బాబాసాహేబుగారు సర్వకాలములందును నిన్ను మెచ్చుచుందురు. పద యువతులనుండు మందిరములోనికిం మేనునిండ సొమ్ములు ధరింపుము. పెండ్లికొడుకిచటికివచ్చునంతలోఁ బెండ్లికూఁతు రలంకరించికొని లక్ష్మీదేవివలె నుండవలెను. పెండ్లికొడుకు వచ్చినపిదప, మహిషాసురమర్దనిప్రసాదము నీవు వానిచేతిలో నిడవలెను ఇదియు, కులాచారము. బాబాసాహేబు గారువచ్చి నీవీరీతి గనుండునది చూచినచోఁ గోపగింపరాయేమి?

భామిని:— తండ్రిగారి భయమునాకు హెచ్చుగఁ జూపవలసినదేమి యంలేదు. నేఁడుదయముననే తండ్రిగారికి నేనంతయును దెలిపినాను. నేనిపుడు ధైర్యధరునిఁ బెండ్లియాడను. ఏమే, అట్టిదరిద్రుని నెవతె పెండ్లిచేసికొనును.

గీ. నిర్ధనునిఁ బెండ్లియాడిన నెలఁతయెందు
నాత్మహత్యయ కావించి నట్టిదగును
మానసానంద మగునెటు హీనభాగ్యుఁ
బతిఁగఁ గలదాని కిలను దుర్గతియ గాదె?

ఇదె చూడు కుసుమా! నాయన్న కోపగింపనీ; మఱెవ్వరేమయిన ననని నేనేమో యాదరిద్ర ధైర్యధరుని బెండ్లియాడను.

కుసుమ:--- చెలీభామినీ! ఇంచుక యాలోచింపుము. నీవు శ్రీమంతుని సుతవైన మాత్రముననే నిన్ను లక్ష్మీపుత్రుని యింటికి నియ్యవలె ననునది రుచితము లేదు.

భామిని:—ఎందుకు లేదు? నాయన్న నన్ను శ్రీమంతుఁడగు వరునకునియ్యక తప్పదు.

కుసుమ:—చెలీ! ఉత్తరాధిపునితో యుద్ధమొనర్ప మనపృథ్వీవరమహారాజు కొందఱిని సేనానాయకులను బంపఁడా యేమి? పరాజితులై వారందఱుఁ దిరిగిరారా యేమి? యింతవఱకు ధైర్యధరుఁడే తన పరాక్రమమున నిపుడు రెండు మాసములలో నుత్తరాధిపుని వెనుకబోవులా గొనరించెను. లగ్న కార్యమును గుఱించి యిపుడిందుకు యవకాశము చేసికొనియున్నాఁడు. ఏవీరుని, జయశ్రీవరియించి రణభూమిపైఁ బుష్పమాలవేసినదియో, యావీరునకు నినుఁబోలినయుత్తమకన్య, లగ్నమంటపమునఁ బుష్పహారము వేయవలెనని పూర్వాచారమున్న దనుటకు నుదాహరణములున్నవి.

భామిని:—ఉండనితేవే నీ యుదాహరణములు. ఈభామిని యితరుల యుదాహరణములరీతిగ నాచరించునది కాదు. నావర్తనయే, పైబంతిగ నుంచికొని యితరులు నేర్చికొనవలెనని నేనుజన్మమెత్తినాను తెలిసెనా?

కుసుమ:—స్వయంవరములలోఁ బణముంచి శౌర్యపరీక్ష చేసినవిదప, సీతాద్రౌపదులనుఁబోలు రాజకన్యలనిచ్చి లగ్నములు చేయఁబడినవి. అవియేమియును నీకుఁ దెలియవు కాఁబోలు?

భామిని:—అవునవును. తెలియును తెలియును. స్వయంవర సమయమున, పట్టిపరాక్రమముపై విశ్వసముంచిన సీతాద్రౌపదులేమి బుద్ధికౌశల్యమును జూపిరో నాకుఁ దెలియక యున్నది.

చ. అవనిజ, యీశువిల్లుఁ దునుమాడిన వాఁడిమిఁ జూచిమెచ్చి, రా
ఘవుని వరించి కాంచెఁగద కాననదుఃఖము హెచ్చుగాను, పాం
డవుల వరించి ద్రౌపది వనంబునఁ జెందెనుగాదె కష్టముల్
ధవుఁడు దరిద్రుఁడైన నెటుదక్కు సుఖానుభవంబు నాతికిన్.

కుసుమ:—భామినీ, నేనెంతగఁ జెప్పినను నీకుఁ దెలియక యున్నది. అదిక్కునఁ జూడుము. అక్కగారు వచ్చుచున్నారు. కమసలవాఁడు చెవులుకుట్టినఁదప్పు........,

భామిని:—అక్కరాని గాక, యబ్బరానీ; ఎవరుజెప్పినను నేనువినను. అక్కపెండ్లియును గాదిది అబ్బపెండ్లియును గాదిది. పెండ్లికాఁదగినది నాది.

( ప్రవేశము. అక్క, చంప, మాలతి, వినోదులు ప్రవేశింతురు. )

అక్క:— బాగాయెను. భామినీ! ఇంకనునిచటనే యున్నావా? నీవలంకరించికొని యప్పుడే యాదిక్కునను దు మందిరంబున నున్నావని తెలిసి యుంటిని. ధైర్యధరుఁడిపుడే యిచ్చటికి వచ్చునట్టుగనున్నది. ఇదియేమే కుసుమా! భామిని మేనుపై నేయలంకారములును లేవు? ఏమియినది?

వినోద:— పేదరాలగు పాపము, మనపిల్ల, యిప్పటినుండియు నేర్చికొనుచు నున్నలాగు తోఁచుచున్న

యది. అక్కగారూ! పుట్టినింటిలోఁ బేదబలెఁ జింపురు బట్టలుఁగట్ట నభ్యసించినఁగదా యత్తగారింటి దారిద్ర్యము బాధింపక యుండును.

చంప:— ఏలే భామినీ! దరిద్రురాలుగా నుండఁబోవుదునను భీతిచే నగలుఁధరింపక యుండు నీవింతటి వెలఁజేయు చీరయేల కట్టితివి?

మాలతి:— ధైర్యధరుని యింటిలో సాధారణమగు చీరఁగట్టవలసివచ్చును, పుట్టినింటిలోఁ జింపురుగుడ్డలు గట్టికొనినఁదప్ప నత్తగారు గృహప్రవేశ కాలమునని చ్చుచీరఁ గట్టి భామిని నే ధన్యనైతినని తెలియవలదా?

చంప:— బాగాయెను భామినీ: చింపురు గుడ్డలుకట్టు పాతమిప్పటినుండియు నేర్చుచున్నావుగదా? మేలాయెను.

వినో:— పెండ్లికొమరుత దారిద్ర్యముయొక్క మొదటిచాయ, సొమ్ములమీదఁ బడినది. తండ్రిగారి యాశ్రయమువదలి, భామినియెపుడు దరిద్రభర్త గుడిసెఁ జేరునో, యప్పుడే వాని యింటివ స్త్రపాత్రలపైనా చాయపడక యుండదు. శ్రీమంతత్వముపోయి దారిద్ర్యమెపుడు వచ్చునో యప్పుడే ప్రథమమున, నగలుపోవును. పిదప భద్రముగ దాఁచియుంచిగొప్ప చీరల జలతారుకొంగులు విక్రయింప వలసివచ్చును. వెలికి వెడలు లక్ష్మీదేవి యిట్లగు రీతిగజరుగు చుండును.

అక్క:— నిజమిది చెల్లెలా! ఆదరిద్రుఁడు ధైర్యధరుఁడు నీకెటులభించె ననునది నేవిచారింప వలసినది గనున్నది. అమ్మా! ఇదియేమో యాశ్చర్యముగ నున్నది. నావివాహ కాలమున మనయిరువురి పెండ్లియుఁ గావలెనని లక్ష్మీధరుఁడను జహగీరు దారునకు వినియ్యవలెనని నిర్ధరింపఁ బడి యుండెను.

చంప:— అక్కాలమునం దక్కగారి మగనియంతటి శ్రీమంతుఁడు లక్ష్మీధరుఁడు కాఁడని భామిని కోపగించిన కారణంబున నాపెండ్లినిలిచి పోయెను.

వినోద:— అక్కగారి భర్తయగు విలాసధరుని వచ్చుబడి యిరువదియైదు లక్షలు. లక్ష్మీధరుని యుత్పత్తి యిరువది నాల్గులక్షలు. తారతమ్యమొక లక్షగనుండెను. ఈలక్ష తారతమ్యము భామిని సహింపదాయెను. ఇపుడో ధైర్య ధరునకునదవిలోఁ బొలములేదు. ఊరులోనిల్లులేదు. అట్టి వాని కంఠమున మాలవేసి, ప్రతిసంవత్సరము వచ్చునిరువది నాల్గులక్షల నష్టమెటుల సహించునో కదా! నేనునిజముగఁ జెప్పుచున్నాను, అక్కచెల్లెండ్ర మధ్యనిరువదియైదు లక్షలయ తరమనునది ననుఁబోలు నిరుపేదకు సహితము సహింపులేదు.

మాలతి:— ఏమిభామినీ! అటులమోముఁ ద్రిప్పితివి? నీపతిరాజాగారియుత్పత్తి యెన్నిలక్షలైనదియుఁ బలుకుము. ఈవినోదుని నోరుమూయింపుము.

భామిని:— ఏమే? ఏవరికిఁ బతివాఁడని పలికెదవే? ఆ ధైర్యధరుని నే వివాహమాడుదునని తలంచితివియా? ఆ దరిద్రుఁడగు ధైర్యధరునితోనే వివాహమాడనని నేఁ బ్రారంభముననే పలుకలేదా? అటులుండియును మఱియు నీవా ధైర్యధరుఁడు నాపతిరాజని యొప్పుదును వల్లని.

పాడుచున్నా వేల? నేఁడుదయమున నాయన్నగారికి నేమి తెలిపితినో దానినే మఱల మఱల నీకు నక్కగారికిని దెలిపెద.

మ. ధని నేనైన యథనాథ మ్మును బతిఁగఁ జేఁతగ నైఁతునే! నిర్ధనుం
డును నెందున్ నిధనుండు కాఁడె భువి? వాఁడున్ మానినీ మానసం
బునకున్ మెప్పుగనిల్చునే? కడిమిదా భూషించునే కాంతవున్
ఘనశ్రీమంతుని భర్తగాఁగొనుచు సౌఖ్యంబందగాఁ బొందగున్.

( వెళ్లును )

కుసుమ:—ఇదియేమే యది యిటులఁ గోపమున వెళ్లిపోయెను? నా యన్నగారు నాకీవిధముగఁ దెలిపి యుండెరికదా, ధైర్యధరుఁడెప్పుడు దేవీదర్శనమునకు వచ్చునో యప్పుడు భామినిని, దేవీ ప్రసాదమని దేవిపైనున్న పూలమాల ధైర్యధరుని హస్తమం దిడఁజేయింపుఁడని

అక్క:— నిజము. అదియు, మా కులాచారము. నా లగ్నమందు నైతమీ మహిషాసుర మర్దనీ మందిరములో సీమంత పూజా సమారంభమాయెను. అత్తటి, దేవీదర్శనమునకు, వారువచ్చిరి. అప్పుడు ప్రసాదమని నేను పుష్పహారమును వారియొక్క చేతిలో నుంచితిని. అది యటు లుండని. ఏమే కుసుమా! నేఁడు ధైర్యధరుగారి సీమంతపూజ కానీ, కాకపోనీ, భామిని యిచటికి నెటులవచ్చును?

కుసుమ:—సీమంతపూజ యీుదయమున నున్నది. పెండ్లికొడుకు మననగరముఁ జేరి గుల్లము దిగినవెంటనే యతఁడు ప్రథమమున మహిషాసుర మర్దనీ దర్శనము చేయవలెను. అటుల ధైర్యధరుఁడు నిర్ధరించినాడు. ప్రథమ దర్శన కాలమునఁ బ్రసాదమిచ్చు సెపమునఁ జలిపత్ని లోకరి నొకరుఁ జూచుటకునై బావాగారీ దినముననే మనభామిని ప్రసాదమియ్యవలెనని నాతోఁ జెప్పినారు. ( పరదాలోఁ గొమ్ముూదఁబడును. ) అమ్మమ్మ!! ధైర్యధరుగారు వచ్చిరికాఁబోలు? అక్కగారూ! మీరిదివఱకు భామినితో నొనర్చిన నవ్వులాటలు ముగిసెను. ఇపుడు నావెంటరండు. భామినిని సమాధాన పఱచి దేవీసమీపమునకుఁ బిలిచికొనివచ్చి నిలుచునటులఁ జేయవలదా?

అక్క:— చెలీ కుసుమా! అచ్చటికినీవేపొమ్ము. భామిని నామాటలు వినులాగొరిందుట నావలనఁగాదు. నేఁబలికినచో నదిహెచ్చుగఁ గోపముఁవహించును.

మాలవి:—కుసుమా! దానిని సమాధాన పఱచుటకు నీవే వెళ్లుము.

వినోద:— భామినిని ధైర్యధరునకునిచ్చి పెండ్లిచేయుట యక్కగారికి నిచ్ఛయుండినటుల తోఁచదు. కావునదాని నేల సమాధాన పఱతురు. భామిని సరసకు వారువచ్చి సమాధానము సేయుట కంటెను, ధైర్యధరుని నిచ్చటినుండి యుద్ధశిబిరము చేరఁబొమ్మని చెప్పుట మంచిదికాదాయేమి?

కుసుమ:— భామినీలగ్నము విఱువవలెనని యక్కగా రిచ్ఛయుంచినటులున్నది. లగ్నమంటపము కట్టఁబడినది. పెండ్లికొడుకు వచ్చినాఁడు. అయినను లగ్నముకాలేదనిన బాబాసాబుగారు వెలికిపోముఁ జూడఁగలరా?

అక్క:— ఆ హేమంటపములో నతేము హోత్రమున భామినిలగ్నమగునని, కుసుమా, తెలియును. నేని పుడు బాహాటముగఁ బలికెదను. అధికారి ధైర్యధరునకును భామినికిని లగ్నమగునని లేదు, ఇంతగనన్నేల కష్టపెట్టెదవు?

కుసుమ:—రెండవ పెండ్లికొడుకు నప్పుడే వెతికి పెట్టినారా యేమి?

చంప:— వెనుక నేల. లక్ష్మీధరుఁడు మనవిలాస ధరునితో వచ్చును.

మాలతి:—ఒకలక్ష యుత్పత్తి తక్కువయని పూర్వము విఱిగినలగ్న మదేమంటపమున విప్రుడు చేసిన మొగిసెనుగదా?

అక్క:— ఆదరిద్ర ధైర్యధరుఁ డూరక పెండ్లికొడుకు స్థానమున నిలుచును. ఆ యాగంతకుని పెండ్లి పంచి వెలికిఁ బాఱద్రోలి వాఁడు దోర్భధురుఁ కదా కుసుమా?

వినోద:— ఇప్పటికాలము నేనుగుర్తించుచున్నాను. ఎచ్చటెచ్చటను బ్రతిష్ఠావంతు లాగంతకులై యధికముగ వచ్చుచున్నారు. రెండునాలుక లాతఁడుండినచో మూఁడవనాలుక సిద్ధముగనుండును. రెండుకన్నులు చూచుచుండినచో మూఁడవకన్ను, పిలువనిదే వచ్చినిల్చియుండునని తెలియుము. రెండుసాక్షులు సమీపించినచో గోడపైకె యాగంతకునిబలె మూఁడవవాఁడు మధ్యవచ్చును. అక్కగారు! ఆ, ఆగంతకులరాక యూటంక పఱచుట యత్యవశ్యకము. కుసుమా! అప్పని నీవొనరించి, నాబలె నే యక్కగారికి సాహాయ్య పడుదువని తెలిసినాను.

కుసుమ:— నేను సాహాయ్యపడుదానను గాను. నేనిటులనేపోయి, భామినికీరీతిఁ జెలిపెదను. లక్ష్మీధరుని గోచిపట్టు కొనితిరుగువారు కొందఱు ధైర్యధరుని నిందించుచున్నారు. సకలమును నీవు చక్కఁగఁ దెలిసికొని దేవీప్రసాదము వానిచేతిలో నుంచినచో వారిముఖ భంగమగును,

(వెళ్లును)

అక్క:— వినోదా! నీవును దానివెంట నేపొమ్మా. మఱియు ధైర్యధరుని నెటునిందింపవలెననిన భామినీ మనమువానిపై బొత్తిగవిఱిగి పోవలెను. అటులొనరింపుము.

వినో:— అక్కగారూ! మీరునిర్భీతిగనుండుఁడి. ధైర్యధరుని నేను యథేచ్ఛగ నిందించెదను. వాని యింటి యన్నము నేనెపుడు నపేక్షింపను చూచెదను. నిజమిది. నాయెదుటఁ గుసుమ యేమి సేయునో?

(వెళ్లును)

అక్క:— మాలతీ! ఈలగ్నమెటులయిన నట్టంకపఱచియ తీరవలెను. ఈదరిద్రునింట నాచెల్లెలు సుఖపడునని నాకుఁదోఁచదు. లక్ష్మీధరుఁడు మాయంతటి శ్రీమంతుఁడుకాఁడు నిజము. అయినను నిరువదినాల్గు లక్షలుత్పన్నముఁ గలవారికాలమున నెవరుగలరు?

మాలతి:—విలాసధరుగారు వచ్చుచున్నా రటుచూడుము.

చంప:— వారివెంటనే లక్ష్మీధరుఁడు వచ్చుచున్నాఁడు.

అక్క:— లక్ష్మీధరునిఁబోలు రాజపిండము మనభామినినిఁ గలయవలెను.

( విలాసధర లక్ష్మీధరుల ప్రవేశము )

లక్ష్మీధ:—లేదుతంత్రీ ఇట్టి వికారిపెండ్లికొడుకును నెచ్చటను జన్మాదినుండి మనముచూచలేదు. విలాసధ

రగారూ! ఆదరిద్రుఁడు మీపద్దకుఁడు కావలెనని పొంచుకొని యుందును. అటులైనను మముఁబోలు శ్రీమంతులు మీతో నెటు కలసిమెలసి యుండవలె ననుశంకనామనమునఁ గలిగినది?

విలాస:— అవునవ్వా: అటులైనది నిజమేను. ఆదరిద్రుని వెంట వీధులగుండ నేను నడుచునపుడు నాకుఁ దలవంపులుగ నుండను.

లక్ష్మీధ:—ఆదరిద్ర ధైర్యధరుఁడు వెలుపట సేనాపతిగనుండినను నింటనీపద్దకుఁ జేరు. అడకత్తెరయొక్క రెండుకాళ్ల మధ్యన నీవిరికికొని యున్నావు. సేనాధిపతి సంబంధమున మముఁబోలు శ్రీమంతు లడుగడుగునను నాదరిద్రునుండి యవమాన పడవలెననునది చాలుఁజాలు. నేనునీబలె బాబాసాహెబుగారి యల్లుఁడయి యుండినచో ఖండితముగ సాధించియుంటిని. అంతటి ప్రసంగము తటస్థించినచో నొకబిడ్డను గాదిగావు రుండినను వారినొకటే తూరిగఁ బెండ్లిచేసికొని యుంటిని. ఆదరిద్రుని పీడ మీయింటవలదు. విలాసధరగారూ! మిమ్ముఁబోలు శ్రీమంతులకు నిట్టికళంకమంటినచో దానినెటు తొలఁగింతురో తెలుపుఁడి వినియెద.

విలాస:— వింటివియా, యేమేనిచెల్లెలు ధైర్యధరునితో వివాహమాడుననిపట్టణము వారందఱును వినినంతటి నుండి ప్రతియొక శ్రీమంతుఁడును నన్నీరీతి నిందింపఁ బ్రారంభించినారు. లక్ష్మీధరగారూ! ఈకళంకము శాశ్వతముగ నిలుచు ననుభీతి నాకుఁ గలుగుచున్నది.

అక్క:— ఈ విషయమున మీరేమియు ననవలదు. నేనందఱినుమాలకమునను భామినికునమువానికై వినుగులాగొనరించినాను. నేఁడో, రేపో మఱునాఁడో భామిని దేవీప్రసాదమిచ్చునపుడు వానికే మోయయ్యెదని ఖండితముగఁ దెలియుఁడి. లగ్నముహూర్తముమాత్రము వ్యర్థము కాదని తెలియుఁడి.

విలాస:— ముహూర్తము రిత్త పోదనిన యర్థమేమి? లక్ష్మీపుత్రుఁడగులక్ష్మీధరుని హాళీళలో ధైర్యధరుని స్థానమునఁ బెండ్లియాడుగు పైనిలుపవలెననియా? లక్ష్మీధరగారూ! అదేకదా దాని యర్థము.

లక్ష్మీ:— నేనెదుట నిలిచినచో నెవరినుండియును నేచటను నేయటంకముఁ గలుగనీయను. ఏమండీ! అట్టి ప్రసంగము వచ్చెనేని, నే నొకరినిగా దిరువురు మువ్వురినైన నొక్కతూరిగఁ బెండ్లి యాడ సిద్ధుఁడుగ నుండెదను. ఇవ్వార్త మీకుఁ బ్రారంభముననే నేను దెలిపినానుగదా? ఆ దరిద్రుని గర్వము విఱచుటకొఱకును మీ యందటి యాగ్రహము మున్నువలె నుండినయెడల మీ యిష్టము నేను వ్యర్థము సేయను. అటు లేనివాఁడ శ్రీమంతులలో నేనెటు శ్రేష్ఠుఁడ నగుదును? వెనుకద్రొక్కువాఁడనుగాను. మీరేమి చింతింపకుఁడి. విలాసధరగారూ! మిమ్ములను నన్ను మఱల నితర లక్ష్మీపుత్రులను నా భికారి ధైర్యధరుని యాజ్ఞరీతిగ రణాంగణంబున నడుచుకొనవలెనని మన పృథ్వీవర మహారాజుగా రుత్తరువుచేసినపుడు, మనమెవరైన నేమిపనిఁ జేసినను వాని నవమాన పఱచుచుండవలెనని మనమందఱము మాటలాడికొని యుండలేదా? మీరు కొందఱు వలదు వలదని పలికినను పరకుసేయక మా కందఱికిని నేను మార్గదర్శినై నిలువలేదా? ఊఁటక యటులైతినా? చూడుఁడి చేసెదను. నేఁటినుండియు

వానికి నవమానము చేయుచుండెను. చెప్పెదను చూడుఁడి.. నా శరీరముపైనుండు భూషణముల మూలకమున వానికి నేఁడైన యవమానము గుర్తించితిరా?

విలాస:— అవునండి, ఎంతటి యపమానమది? మంచి యపమానమది.

చంప:— నేఁడా శవమునకు మంచి యపమాన మాయెను.

విలాస:— వాఁడెంతటి బుద్ధిశాలి యైనచో నేటి యపమాన మెఱింగి తనంతటఁ దానే లగ్నముపై నాశ వదలవలెను.

లక్ష్మి:— ఊరేగింపు సమయమున వాఁడు నా శరీరభూషణములు ప్రారంభమునఁ జూచినంతటనె తన ముఖముఁ ద్రిప్పికొనెను. ఇంతటి యపమానమైనపిదప వాఁడిచ్చటనుండియే మరలిపోవునని నేఁ దలఁచితిని. వాఁడు మంచి యూరితేఱిన మొండిగ నున్న వాఁడు. నే నూరేగింపు సమయమునఁ బ్రాముఖ్యుఁడనై ముందు నడుచుచుండ నా నీడయుం బోలె వెనుక వెనుక వాఁడు వచ్చుచుండెను.

అక్క:— ఆ శవమునకు నేఁడింతటి యపమాన మాయెనా?

విలాస:— అవమానమని యేల విచారించెదవు? లక్ష్మీధరుగారి శరీరభూషణములును వారి శ్రీమంత తనమును నీవు చూచియుండినచో నీకే తెలియుచుండెను. భూరి లావణ్యముఁగల ముత్యములును, మణులఁ జక్కఁగ నేఱితెచ్చిన నిష్కళంకమగు వజ్రములను నే లక్ష్మీపుత్రునివద్దను లేవు. అట్టి ముత్యముల మూర్తియగు విగ్రహము సమముగ, ధూళి ధూసరితమైన బొమ్మ వచ్చుచుండ, నపమాన మెంతయుండునో?

లక్ష్మి:— నా యంగభూషణములను జూచి సర్వులు నేనే పెండ్లికొడుకని తలఁచికొనిరి. ఒకరిద్దఱు నా దిక్కున నే వ్రేలుఁ జూపుచుఁ బెండ్లికొడు కితఁడేనాయని ధైర్యధరుని నే యడిగిరి? ఇంతటి యపమాన మెవర్చితిని. భళి భళీ! - ఇంతటి యవమానమందు ధైర్యధరుఁడు తలవంచియుం వంచకయుండ, గుంపులోనున్న యొకస్త్రీ, వానిదిక్కు వ్రేలుచూపి, పెండ్లికొడు కింతటి వికారిసేవకుఁడా? ఇట్టివాఁడెచటనుండి వచ్చెను? అని వినఁబడునట్లు పలికెను. ఇంకను వానికిఁ గాఁదగిన యవమాన మేమున్నది?

అక్క:— బాగాయెను. ఊరేగింపుమున్నే వానికి గొప్పయవమానమైనది బాగాయెను. దరిద్రులలో దరిద్రుఁడగువానికి నా చెల్లెలు భార్య యెట్లగును? ఆ దరిద్రుని గర్వము ఖండియ తీరవలెను. కాదేని నా దరిద్రుని యింటిలో నా చెల్లెలకు సుఖమువచ్చునెటు?

విలాస:— సుఖమెటు కలుగును?

గీ. రవినిఁ గ్రైసేయఁ బుష్పహారంబు వేయ
రోజుచును గాల్చుఁగాఁ దన తేజమునను
కోతికిని రత్నమిచ్చినఁ గొంకుమాని
నోటఁ గఱచును, దన్నును, జేటుఁ దెచ్చు.

లక్ష్మి:— అట్టివారినిఁ జేరిన వస్తువు నదేగలిరేను. మూర్ఖునిబలె నడుముమఁ గత్తిఁగట్టుకొని లగ్నమునకు వచ్చినవాఁడు. పెండ్లికూఁతురును గరవాల ధారచేఁ గత్తరించి బలియిచ్చునాయేమి? పెండ్లికొడుకయి వచ్చినపుడు సొమ్ములైనను ధరింపరాదాయేమి?

గీ. చూడనంగముపై నొక్క సొమ్ము లేదు
మడియునడవిని, వీడును బుడమిలేదు
వీధులను బిచ్చమెత్తెడు వెఱ్ఱివాఁడు
భాగ్యహీనునకేలకో భార్య భువిని?

అక్క:— నిజమేను. వానిశరీరముననొక బొటకపుమణి యైనను లేదు.

మాలతి:— ఇస్సీ, వానిగొంతు పిల్లిగొంతువలె పట్టిదిగనున్నది.

చంప:— వ్రేలికి నొకయుంగరమైనను లేదు.

విలాస:— అటు చూడుఁడి. బాబాసాబుగారితో ధైర్యధరుఁడు వచ్చుచున్నవాఁడు చూడుఁడి వాని మెడలో నేమైన నున్నదియో లేదో?

లక్ష్మీధ:— నేను ప్రారంభముననే పలికితినిగదా! చూడుఁడి వాని దేహముపై నేమయిన నున్నదేమో? చక్కఁగఁ జూడుఁడి. వాని వ్రేళ్లు దిట్టించి చూడుఁడి. వానిలొక్క చెవులు చూడుఁడి. పిదప నా భావలీలను జూడుఁడి. శ్రీమంగునకును దేనకును నంతరాయమెంతయో కనుఁగొనుఁడి.

విలాస:— జూడుఁడి చేతులలోఁ గడియముగాని మణిబంధనముననొక కంకణముగాని యున్నదేమో?

చంప:— ఇట్టివానిని నేనెచటను జూడలేను. వీనిరయిముక, కుక్కయైనను నంటదు.

మాలతి:— పట్టిగొంతు. విధవగొంతువలె యపలక్షణమైనది.

అక్క:— శిరముపైనొక తురాయియైనను లేదు. ధూళితో నిండిన వాని రుమాల తురాయి లేక జుట్టులేని సన్న్యాసి తలబలె, బోడిగనగపడుచున్నది. అమ్మా! వలదే నా చెల్లెలు బంగారుబలె మన్నది. వానిదార గావలదు.

( బాబాసాబు ధైర్యధర శీలధరులు ప్రవేశించుచున్నారు. )

ధైర్యధ:— బాబాసాహెబుగారూ! నేనవసరపడుచున్నాననుటకు మఱేమియుఁ గారణములు లేవు. ఉత్తరాధిపతి చేసికొనిన సంధికట్టుబడిరీతిగ రెండు నెలలును సమాధానముననుండక తన సేనతో నా శిబిరముపైఁబడ యత్నించుచున్నాఁడను వార్త నేఁడే నేను వింటిని. శత్రువులు మన సేనపైఁబడి దుందుడుకు లొనరించుచుండఁగ, నేను లగ్నోత్సవమున మునుఁగుట సమంజసము కాదు. చెప్పటయేమనఁగా, రేపు ప్రాతఃకాలముననే లగ్నము ముగించి నాకు శిబిరమునకు సెలవిండు.

బాబా:— అటు కాదండీ! రెండు దినము లుండుఁడి. శిబిరములో గడబిడ యేమియుననుగాదు.

విలాస:— రెండు నెలలవఱకు యుద్ధము నిలుపవలెనని కదా కట్టుబడి?

శీలధర:— ఇష్టము పుట్టినరొదలఁ గట్టుబడి నిలుచుట యెంతపని? ఉత్తరాధిపుఁడు సంధి విఱుచునను చిహ్న స్పష్టముగ నగపడుచున్నది. కారణమేమనఁగా శత్రురాజు దారి దోఁపుదుగాండ్రతోఁ గూడి, కట్టుపాటునకు విరుద్ధముగా నాలుగైదు శిబిరములపైఁబడి కొల్లగొట్టినాఁడు.

నే భామినివచ్చి మీకుఁబ్రసాద మిచ్చును.

ధైర్యధ:—( దేవికినమస్కరించి ) బాబాసాహుగారు: ఇదేహావకున నున్న దేవీదర్శనము నాకుఁబూర్వమునమైనది.

బాబా:— మీకీమందిరములో నేఁడే ప్రథమమునఁ గాలుపెట్టినది అయిన యీదర్శన మీకెచట యెట్లాయెను?

ధైర్యధర:---

ఉ. మాతనుఁ జూచినాను రణమండలిలో విహరించుచుండ్, జగ
న్నేతకుఁ దారహారముగ నేర్పునఁ గూర్చుచునుండు, వీరసం
జాత పునీతరుండములు, సంగరసీమను నేర్పుతోంచి, నే
నాతలినెల్లఁ గాంతును మదంబను నీమహిషాసురారినిన్.

లక్ష్మ:—( అవతల విలాసధరునితో ) ఎన్ని ప్రగల్భములు పలుకుచున్నాఁడు వీఁడు వీఁడుయుద్ధ సమయమునఁ బ్రత్యక్షముగ మహిషాసుర మర్దనినిఁ జూచినాఁడట! వీరవారు తమలోపములను గప్పివేయు నిట్టి డాంబికము మాటలాడుచుందురు. (మరలుచు) ఏమండీ: మీకుఁబ్రత్యక్షముగ దర్శనమాయెనా? ఆ!

ధైర్యధ:—రణాంగణమున, మహిషాసురమర్దనీదర్శన మెవరికిఁ గాఁజాలదు. దీనివిషయమున నాశ్చర్యము మీకేల? ఏమండీ. యుద్ధావనిని నెల్లకాలము లందును దేవతా సంచారముండును.

చం. సురలకు ముందినవ్వగుసు నూాపె రణాంగణమొందు, దేవతా
వరుల విహారచారు తరభవ్య తలంబది శూరవారభీ
కరతరవార సారతర కాంతినిరంతర శోభితమ్ము శ్రీ
కరమహిషాసురారి చిరకాలము భక్తులఁ బ్రోచుచచ్చటన్.

బాబా.—ఏమేభామినీ: ఏమేభామినీ: కుసుమా: వచ్చెనా భామిని? భామిని యెచటనున్నది.

కుసుమ:---( పరదాలోనుండి ) బాబాసాహుగారూ: భామిని యిచటనే వాకిలివెనుక నిలిచినది. మీరుపిలిచినచో ముందరికి వచ్చును.

బాబా:—( వాకిలివద్దకువచ్చి ) భామినీ! ఇంతటిసిగ్గేల. వెలికిరమ్ము.

భామిని:—నేనురాను. నేనుఖండితముగ రాను. మటలఁ బలికెనను నేనురాను.

బాబా:—ఏమి యీపిల్ల పిచ్చిదైనది. ధైర్యధరగారూ: నేనిపుడే పోయిదానినిఁ బిలిచికొని వచ్చెదను.

ధైర్యధ:—బాబాసాహేబు గారూ: మీకంతటి శ్రమరయేల? దానికినిచ్ఛ లేనపుడు మీరేల బలవంతపు మాఘస్నానముఁ జేయింపఁ బూనెదరు? ఇప్పటికైనపని బాగుగనే యైనది. నేను వెంటనే శిబిరమునకుఁ దిరిగిపోవ నిఁక దేయుభ్యంతరమునులేదు. మహిషాసుర మర్దనీ దర్శనము

యుద్ధసూచకము. ఇట్టి దర్పనమైనపిదప, లగ్నమంటప మెక్కి కోరికకంటెను యుద్ధమునకు సిద్ధమగుటయు, కర్తవ్యము.

( వెళ్లుచుండును )

బాబా:—వద్దండీ! వద్దు. కొంచెము నిలువుండి. పిల్ల మూర్ఖురాలు. ఇటుచేయకుండి. నన్నుజూడుండి. కోపమువలదు. ఈ యవమానమును నేను సహింప.

( ధైర్యధర శీలధరులు వెళ్లుచున్నారు )

బాబా:—విలాసధరగారూ! అతఁడు కోపగించి వెళ్లిపోయెను. మీరువెళ్లి వారి నూఱడించి మఱలఁ బిలిచికొనిరండు.

లక్ష్మీనాథ:—వాఁడు తనశిబిరమునకు వెళ్ళిపోనిమ్ము. విలాసధరగారూ! వానివెంట మీరేలపోయెదరు? వెళ్లుదము నావెంటరండు. పెండ్లియరుగు దారిఁజట్టెదను. భామిని లగ్నమంటపమునకు వచ్చిన క్షణముననే నేఁ బెండ్లిపీటపైఁ గూర్చుండెదను.

( యవనిక పడును )



# మానాపమాన నాటకము.

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

### విలాసధరు శిబిరము.

విలాసధర వినోదుల ప్రవేశము.

వినోద:— మహారాజా! నా మొఱ యించుక వినవలెను. నాకు వంటిన యీ తిరుగుడుపీడను వదలింపవలెను. ఏమండీ! దినదినమును ప్రాతఃకాలమునందు భామినితో శిబిర శిబిరములు తిరుగుచుఁ దిరుగుచు నాకు నిండుగ్రక్కయైనది. కావున నేయుపాయమైనను వెదకి త్వరలో భామినీ లక్ష్మీధరుల వివాహ మగురీతిఁ జేయుఁడి. అటుచేసినచో భామినితోఁగూడి యుద్ధరంగమునఁ దిరుగు కష్టము నాకుఁదప్పును. ఈ స్థలమున యుద్ధమయినపుడు ధైర్యధరుఁడు తన పరాక్రమము చక్కఁగఁ బ్రదర్శింపఁ జేసెనని యెవరు భామినికి దెలిపిరోగాని యా భామిని గడియగడియకు రణాంగణము దిక్కునకే చూచుచు నిలిచియుండును.

విలాస:— ధైర్యధరుని పరాక్రమోదంతంబు భామినికి నెవరు తెలిపిరి?

వినోద:— యుద్ధసంగతు లెవరెవరికిఁ దెలుపవలసినదియులేదు. కొంచెమిచటికి నచటికిఁ దిరుగుచుండినచో, వెంటనే సంగతులు తెలియవచ్చును.

విలాస:— నిజమిది. ఒకనెల భామిని రణాంగణ సమీపముననుంచిన పిదపఁ గావలసియుండినయెడల లక్ష్మీధరునకిచ్చి పెండ్లిచేయవచ్చునని బాబాసాహుగారు హఠముపట్టినారు. ధైర్యధరుని పరాక్రమక్రమము భామిని యిచటనుండినచో వినునని బాబాసాహుగారు పన్నినయుక్తి యని యిపుడు నాకుందోఁచుచున్నది. ధైర్యధరుఁడెంతటి పరాక్రమవంతుఁడైననయు భామిని మనములోఁ జిక్కఁగ నాటినది. ఏమనియెదవునీవు?

వినోద:— నిజము నిజము. మీరాదినముననే లక్ష్మీధరునితోఁ బెండ్లిచేసియుండిన యెడల.

విలాస:— నే నటులనే చేయనుంటిని. అయిన, నా ముసలివాఁడు సమ్మతించునంతలోనే యీ పోరుగాలివీచెను. కావున నటంకమాయెను. మఱల "ధనము హెచ్చా పరాక్రమము హెచ్చా" యను విషయమును భామిని కనుఁగొనవలెనని దాని నిచటికిఁ బంపినాఁడు. భామిని, యెచటనుండునదియుఁ దెలిపెదవా?

వినోద:— ధైర్యధరుని శిబిరసమీపముననుండు కుసుమయొక్క యుద్యానవనమునఁ గుసుమతోఁగూడి యున్నది. వనమాలయని మాఱుపేరు భామిని యుంచికొనినది. కుసుమ తనపేరు పుష్పమాలయని మార్చినది.

విలాస:— నీ వెందుకు మాఱుపేరుంచికొనలేదు?

వినోద:— సుపలితజనముయొక్క సర్వస్వాభావములకీతిగఁ జేరు సైతము మాటికయే నిలుచునుకదా? నే నిపుడు నా పేరడవడలనేరాను నిక్క యేమియుండుటలేదు. పాదములు మాత్రే మొకచోటు నుండి మఱియొకచోటికి మార్పబడియున్నవి. ఆ కష్టము నాకులేనటులఁ జేసినఁజాలు.

విలాస:— పొమ్ము. నీవేమియుఁ జింతింపవలదు. నేనాయుద్యోగములోనే యున్నాను. భామిని, వనమాలయను పేరుఁబెట్టుకొనినదనియును, భాగ్యవంతులగారి యానతిరీతిగ రహస్యముగ శిబిర ప్రాంత్యమున నున్నదనియు నచటనే తిరుగుచుండుననియు దాసీజనము ధైర్యధరునిపై వలచినదనియు నీ వార్తలన్నియు నా కింతకుమున్పే తెలియును. దీనినన్నిటి నంతరాయము గలిగింప నైకమ్యో ప్రయత్నించుచున్నాను. నీవు వెళ్లుము. ఏమయినను హెచ్చు తగ్గులైనచో నాకు వెంటనే తెలుపుచుండుము. (వినోదుఁడు వెళ్లును.) లక్ష్మీనథునకును భామినికిని వివాహమగుట యెట్టులు? అన్ని శిబిరస్థలములు రహస్యముగ సంచరించుచు భామిని ధైర్యధరుని కంఠమునఁ బుష్పమాల వేసినచో నాయొక్కయు సకల శ్రీమంతుల యొక్కయు మోములందు మసిపూసినట్లగునుగదా? భామిని జననము శ్రీమంతుని మందిరమున. దాని సోదరి శ్రీమంతుఁడగు నాభార్య. శ్రీమంతుఁడగు లక్ష్మీనథుని భామిని వరింప వలెను. ధైర్యధరుఁడు కడుపేదయని భామిని నిరాకరించినది. మఱల నది యీ బికారి యిల్లుఁ జొచ్చినచో మా శ్రీమంత పుత్రులెల్లఁ బ్రాణముల నెటునిలుపుదురు? వెయ్యాలు తటమట లానరించినను భామిని లక్ష్మీనథుని నే...... (లక్ష్మీనథుఁడప్పుడే పెట్టె చేతిలోఁ బట్టుకొనివచ్చును)

లక్ష్మీనథ:— వరించునటులఁ జేయవలెను. అగునదియు నదేరీతిగా నే. దానికి సందేహమేమియును లేదు. ఇప్పటి నావస్త్రభూషణాద్యలంకారములను నీవు చక్కఁగఁ జూచినచో నీకే సందియమును గలుగదు.

విలాస:— మీరు చక్కఁగ శృంగారించుకొన్నారు.

లక్ష్మీనథ:— నే నెప్పుడద్దములో నావేషమును జూచికొంటినో యప్పుడే నాకదేరీతిగఁ దోఁచెను.

విలాస:— ఏమితోఁచెను?

లక్ష్మీనథ:— నేను భామినినయ్యెతిని నిజముగ నైతిని యనితోఁచెను. నీకు నటులఁగపడదా? నేను భామిని వలె నైనానని నీకుఁ దోఁపదా? ఏమీ! ఇట్టి నను బోలు శృంగారవంతుఁడు దొరకుట పూర్వ జన్మఫలమనియు నీజన్మమందు లేకయున్నను ముందుజన్మమందైనను నాడుఁజన్మమునఁ బుట్టింపుమని పురుషులందఱుఁ బరమేశ్వరునిగుఱించి ప్రార్థింపక వదలరు. స్త్రీజాలి యనుభవమీరీతిగ నుండును. నన్నుఁజూచి స్త్రీజాలి యంతయును. దమకు నేనే భర్తగఁ గావలయునని మాటలాడుచునుండు రవునా కాదా? నీకును నదేరీతిగఁ దోఁపదా?

విలాస:— నాకేమియుఁ దెలియదు. ఇపుడీవేష మంపయోగము లేదు. నీవు నీతరవారమును దీసికొనిరమ్మని మొదటనే చెప్పిపంపితినిగదా? ఈ పెట్టెనేల తెచ్చితివి?

లక్ష్మీనథ:— ఈ పెట్టె, మంచిముత్యములతోను వజ్రములతోనుఁ జెక్కఁబడిన సొమ్ములతోనిండినది. భామినిని వశపఱచికొనుటకు ఖడ్గమేల? ఆఁడుదానిని హస్తగతగ నొనర్పునది సొమ్ముల దెబ్బరయేను.

చం. కనక విభూషణమ్ములను గాంచిన, కాంతమనమ్మె వానికిన్
గోనఁజను, వానిప్రాప్తికినిఁ గొంతకయొప్పని యైనఁ జేయుఁ, ద
ప్పని యువతీ వశీకరణబంధుర యంత్రము కాంచనమ్ము, భా
మిని యనిజూపఁ దెచ్చితిని మెచ్చును నన్ను నహో ప్రచ్ఛికన్.

విలాసవరా! ఈ పేటిక చిన్నభామినియని తెలియుము. పెద్దభామిని జూడముండినఁ జిన్న భామిని వెంటనంటును. చిన్నభామినినిఁ జూడముండినఁ బెద్దభామిని వెంటనంటును. పెద్ద యుండినచోటనే చిన్నది. చిన్నదియుండినచోటనే పెద్దది. ఇటులనేకదా యైంద్రజాలిక విద్య? అక్కారణముననే కావలసినన్ని సొమ్ములతో నింపిన పెట్టెను దెచ్చినాను నా యెదుటనే యుంచికొనియున్నాను. ఇటులుండ నీకు ఖడ్గమేల?

విలాస:— ఏమండీ! భామిని మీచేతినుండి జారినదని తెలియును. విరోధమంతయు నిప్పుడే వచ్చిపోయెను. వాఁడు నైతే యొక విరుద్ధవార్తఁ జెప్పెను. ఏమన మీకు మీ కృపాణము.

లక్ష్మీధ:— ఏవార్తనుగురించి విరుద్ధము? భామినికేమి చెఱుగుమూడెను?

విలాస:— అదికాదు. భామిని శ్రీమంతునివలలో నిరతముఁ బడియుండెను. ఇప్పుడు పరాక్రమము దిక్కు నెందుకిందుకు జూచుచున్నది గనుక నీవు నిందుకు పరాక్రమమును జూపఁ బ్రయత్నించవలె యున్న భామిని వైశ్యవరునిదిక్కు వాలును. ఇదినిజము.

లక్ష్మీధ:— పరాక్రమముఁ జూపవలెనని పలికెదవా? అది నానుండి కాఁజాలదు. నీవు ఖడ్గముఁ దెమ్మని నామాట యంటినవెంటనే, పని యిరువురు సేవకులనుబిలిచి ఖడ్గమును వెదకఁ బంపితిని.

విలాస:— అయినఁ గృపాణము దొరకదాయెనా?

లక్ష్మీధ:— సుదతి దొరకెను.

విలాస:— లేనికారణమేమి?

లక్ష్మీధ:— తుక్కుబట్టి యొఱనుండి వెలికిరాదయ్యెను. నేను నిందుగఁ గ్రమపడితిని. తరవాత కార్యము చూడవలసిన్న భామిని దొరకదేని యది దైన్యగతునిసే, చరింపనిమ్ము. నాకేమి యాఁడువారు కఱవా? ఈ పేటికలోని యొక్కొక వస్తువునకే యనేక లాఁడువారు దొరకుదురు. మఱియేమి?

విలాస:— లక్ష్మీధరగారూ! మీమాటలువిని నేను నవ్వుదునా యేడ్తునా యనునది తోఁపకయున్నది. ఏమండీ. లోకుల యోగ్యతగా ప్రతినములోనున్నవి. అటులుండ శ్రీమంతులగువారు తమకుం జివిడ్డల నితరులయిండ్లకు నిచ్చినయెడల లక్ష్మీదేవి సైతము తానును మమ్మువదలి యితరుల యిండ్లకుఁబోవదా? ఆఁడువారి పాదము వెలికిఁబడినచో వెంటనే లక్ష్మీదేవి పాదములు సైతము వెలికిఁ బోవును. ఎవరు లక్ష్మిని భద్రపఱుపఁ దలఁతురో వారాఁడువారిని బోగొట్టుకొనఁగూడదు. లక్ష్మీదేవికంటె నాఁడువారి యోగ్యత హెచ్చగు కారణంబున రామ రావణ యుద్ధంబులయ్యెను.

గీ. కలిమి, బలములు, శౌర్యంబుఁ గలిగియున్న,
వనిత, సిరులకు నెల్లను వసతియనుచు,
సతిని సీతనుఁగొనిపోయె శతముఖుండు,
గానఁగలుములచేడియ కలికిగాదె.

ఎవ్వఁడాఁడుది తన్ను వదలి పోవునో యప్పుడు వాని సర్వస్వముఁబోయినదేను. లక్ష్మిపోవును బలము విఱుగును సంసారమే క్షణభంగురమగును. భామినిని బోలుదాని మనోవృత్తికిఁజాంచల్యము కలిగెనేని జీవితము పోయినట్టేను. ఒకటేటూరి యువతి స్త్రీ మానసవృత్తికిఁ జాంచల్యము కలుగునో వానిని వానియింటిని వానిసమాజమును మూఁటకట్టినరక సమీపమున నుంచి నట్టని తెలిసికొనవలెను. లక్ష్మీధరగారు అటులైన భామినినిఁ దమసమాజమునుండి వెలికిఁ ద్రోయుమనివలదు. మమ్ముఁ బోలు లక్ష్మీపుత్రులపని యేమినిలిచెను?

లక్ష్మీధర:—భామినిని వశవఱచి కొనుట నాయిచ్ఛలేకపోలేదు. అయిన నామతనిశ్చయము నాకునమంటి నది. కృపాణవిషయముకంటె నాధరణవిషయమధికోపయోగమని నేఁ దలంచుచున్నాను. నీవు వనితలను పురుష దృష్టితోఁ జూచుచున్నావు. నారీతిగ నాను వారిదృష్టితో భామినినజూచినచో నాదువారిచర్య నీకుఁజక్కఁగఁ దెలియును. అనురితనంతకుఁదానే మనమంపని యెడల దాని రహస్యమును దెలిసికొనుటకష్టము. మీ రోకయానుదానని తెలిసికొనుఁడి అటులయిన యీ పేటికనుఁ జూడుఁడి. (పెట్టెమూతఁదీయును.) అప్పుడు మీ మానసపరిణామమెటులుండునో తెలిసికొనుఁడి. ఈ సొమ్ములకాంతి మీ కనుగవ నిండును. ఇది మీకండ్లు నిండినయెడల భామినిమూయుట కష్టమగును.

గీ. సామ్యసమములు కలయును సమమనమ్మ
లటులెకూడును తెలియుమా, యర్థమున్న
చోటనర్థంబుఁ జేరును జోద్యముగను,
సుందరాంగునిఁ జేరును సుందరాంగి.

ఇప్పుడు చెప్పవే చూతము నాయుపాయమమేలా? మీయుపాయము మేలా? ఏమి మీ ముఖభావము మీనిట్టూర్పు. ఏమో తెలియకున్నది? మీయనుభవము మీఁదనే మీరు తెలిసికొనుఁడి. మీకే యిటులైనచో నీ పేటికనుఁ జూచి భామిని యెటులగునో?

విలాస:— లక్ష్మీధరుగారూ; మీకు నామాటల యభిప్రాయము తెలియరాదా? సొమ్ములకు లబ్ధుఁడ నగుటనా ముఖభావము మాఱినదని కదా మీరు తెలిసితిరి? మీ, యొక్క శబ్దమెటు లెటుల నా వీనులలోఁ జొచ్చెనో యటులటుల నాకుఁదోఁచిన దేమన భామినీకార్యమున మాకు హెచ్చుకష్టమగునని. నా నిట్టూర్పునకుఁ గారణంబది యేను. మిత్రమా! నా పలుకు వినుచుకవినుము. వినినచోఁ జెడినకార్యము చక్కఁబడును.

లక్ష్మీధర:— వినననినే నెపుడంటిని?

విలాస:— ఈ పేటిక మొదటమూతమూయుఁడి. ఇదె గనుము. ఏపురుషునియొక్కగాని, స్త్రీయొక్కగాని మనములో విశేషకారణమేమియుఁ బొరకున్న యెడల సామాన్యప్రవాహమే

పొఱుచుండును. అట్టివారిపైనధనము పనిచేయఁడు. పురుషులెటు ధనమార్జింతురో స్త్రీలు నదేవిధముగ నాశించుచుందురు. ద్రవ్యాపేక్ష గలవారు దాని నాశించి ధనికులనాదరింతురు. ఇది సామాన్యస్త్రీపురుషులమాటగ నున్నది. అయిన ధనమునుండి ప్రేమ యుత్పన్నమగుచున్నదనిమాత్రము తెలియవలదు. ప్రేమకుఁ జన్మదశ్శవు లేదు. కావున లక్ష్మీప్రకాశము దాని కగపడదు. కావుననిట్టియుపాయము లింతటినుండి వదలి భామినీ యంతరంగమునందుఁ జొచ్చు ప్రయత్నముఁ జేయుము.

లక్ష్మీ:— చాలునబ్బా! నీవెటుచెప్పెదవో యటులొనరింతును. ఈ పొమ్ముల దెబ్బ వెనుకవేయుదును. ఇపుడు నీవుచెప్పెడిమాటయును జింతించుచుండెద.

విలాస:— దీనినివినుము. భామినీలక్ష్మి మిపుడించుక కార్యము దిక్కు-చాలుచున్నది.

లక్ష్మీప్ర:— నిజమా? వాలుచున్నదియా? నీకుఁదెలుసునా? అటులైన నే నింక నెటులనెట్టుల కూరుఁదగుదును? దానినిఁ దెలుపుము. కూరుఁడగుటకునాకేమి పోవును? అలంకారములు ధరించి కూరుఁడగుదును. ఏమిపనిపడునో యావనిఁజేసెద. మనోహరురాలగు సుందరి నొరకట్టై సేవకునిబలెఁ గష్టబడుటకు నభ్యంతరమేమున్నది?

విలాస:—ఇదిసరియయినమాట. ఇఁకనీవుకూరుఁడగుట యెటులనో, దానినిఁదెలిపెద. శిబిరపీఠులందు దండోరా కొట్టినవార్త నీకుఁదెలిసి యుండునుగదా?

లక్ష్మీ:— ఏమి దండోరాయది?

విలాస:—శత్రువులు చిన్నచిన్న గుంపులు వేష్వేరయిరాత్రులు మన శిబిరములపైఁబడి కొల్లఁగొట్టను దిరుగసాగినారు. నీవేలటు భయపడిరెదవు?

లక్ష్మీ:— కొల్లఁగొట్టనిచటికి వారువచ్చినారని.

విలాస:—ఇపుడేమిభీతి? ఇచటికి వచ్చువారెవరు? దండోరావిషయమునేను దెలిపితిని. కొల్లఁగొట్టను శత్రువులు వత్తురంటిని. ఇఁకనురాలేదుకదా?

లక్ష్మీ:— ముందువత్తురనియా? ఇపుడురాలేదుకదా?

విలాస:—లేదు. లేదు.

లక్ష్మీ.— అటులైన నభ్యంతరములేదు. ఇఁక ముందుచెప్పుము నీ మాటలు. దండోరా కొట్టినారు. అదిచాలును. ముందు?

విలాస:— దండోరా కొట్టినారు. భామిని తనమిత్రురాలగు కుసుమరెయొక్క- యుద్యానవనములో విహరింప సాగినది. కావుననేఁజెప్పునదేమన నేను శత్రువేషమును ధరించెద. భామిని యిల్లును గొల్లఁగొట్టఁబోయెదను. భామినియేడవసాగినయెడల నీ వొక్క-రూరిగ ముందఁకిరమ్ము. మఱియుఁబురూరవుఁడూర్వశిని విడిపించినటుల విడిపింపుము. నీ మనసుకువచ్చెనా?

లక్ష్మీ:— ఏమిచెప్పితివి. భామిని యేడ్చినంతట నేను కూరునిబలె నేమికఁబడవలెనా? మంచిది. ఇదియంతయు బాగుగనున్నది. అయిన మీరే నాతో యుద్ధము చేసినయెడల?

విలాస:— అటుల కాదు. నీవేముందటికివచ్చి నాపైఁగత్తినిఁదూసి విసిరి నేను బలుగెత్తిపోరెదను.

లక్ష్మీధర:— నీవు పిరికి. నేను శూరుఁడ. ఇటులఁ బ్రవర్తింపవలెనా?

విలాస:— నిజము. అదేరీతిగనే. మీరుమీకరవాలిఁ దెచ్చియుండినయెడల దానిని మీరెటు నాపైనుపయోగింపవలెనో, యావిధమును నేర్పుచుంటిని.

లక్ష్మీధర:— నేర్పుట వలదు. మూలములో, నీవున్నఁ దనంతకుఁదానే వెలికివచ్చును.

విలాస:— మీదిలేకయున్న మీరు నా కత్తినిఁబుచ్చుకొనుఁడి. వాయుఁగము పై నాటుకత్తినిఁదెత్తుగో చూపుఁడి.

లక్ష్మీ:— మంచిది చూచెద. నీవు భామినిపైఁ బడుటెటులనో చూపుము.

విలాస:— మంచిది. నేను భామి నీమందిరంబునఁ జొచ్చితినని తెలిసికొనుము. నేను వానిని భయపెట్టు మాటలాడిన క్షణముననే మీరుకత్తినిదూయుఁడి. "ఓపిల్లా! అన్ని సొమ్ములును విచ్చియిచ్చుటఁబెట్టుము. కాదేని ప్రాణాంత్యమేను" ఈ మాటలాడెదను. కత్తినటులెత్తెదను.[ఎత్తును]

లక్ష్మీ:— (కంపించుచు) సకలాభరణములనిచ్చెద. నాప్రాణముఁదీయకు. అన్ని నగలును గీసికొనుము దేహము మీదివికూడదీసికొనుము. పేటికనైతము తీసికొనుము.

విలాస:— ఏమండీ! మీరటులేల చేసెదరు? మీరు నాపైఁబడి నను గత్తిచేఁబొడిచినరీతిఁ జేయుఁడి.

లక్ష్మీ:— నేను దానిని మఱచితిని. మీరు వింధుభీకరముగఁ బలికెదరు కావున నాకటుభయమాయెను అదిగాక మీరుత్తరదేశభాషలో మాటలాడకున్న మీరు చోరులు నేననెవలియని తెలియుచుండలేదు. ఇఁక మీరుత్తరదేశము మాటలాడితిరేని మీ సమాచారము తెలియవచ్చును. [విలాసధరుఁడదేరీతిగఁ బైవాక్యము పలుకును. లక్ష్మీధరుఁడు వడఁకుచు మోకాళ్లపైఁగూర్చుండి సొమ్ములపెట్టెను ముందఱఁబెట్టి దేహముపై సొమ్ములు తీయుండుఁ బూర్వమురీతిగఁ బ్రార్థించును.]

విలాస:— ఇదిరేమి లక్ష్మీధరగారూ! ఏమండీ మీరు శూరులు వీరులనునది మఱవకుఁడి.

లక్ష్మీ:— మంచివేళలో నటంకమాయెను. ముందిత్వఁ జేయను. ఇదిగో మీరాసమయమున నుత్తరదేశభాషయేమియు నాడకుఁడి. ఆభాషనన్ను నిండుగభయపెట్టుచున్నది. భామిని సరస నారీతిగఁ గుక్కలబలెనఱవకుఁడి. ఆఁడువారిబలె మృదువుగఁ బలుకుఁడి. "పిల్లా! సొమ్ములు విచ్చియిమ్ము. కాదేని ప్రాణాంత్యము" అని పలుకుము.

విలాస:— భామిని మీ భవిష్యత్పత్నియని యిప్పటినుండియు, దానినింత మెత్తతనమునఁ జూచుచున్నారు. నేను దొంగబలెనఱచినపుడది బెదరినచో మీకేమి?

లక్ష్మీ:— అదియెప్పటికైనను నాసొమ్మేకదా; కావుననీవు మృదువుగమాటలాడుము. "పిల్లా, సొమ్ములు విచ్చియిమ్ము కాదేని ప్రాణాంత్యము", అనినంతనే నేనెటుగర్జించుచు నీ దేహము పై. వేగమున వత్తునో యది చూడుము. అదిగాక నీ తరవారి నాకుఁబొందదు. నీవేతీసికొనుము. నా శిబిరమునకురమ్ము. అచట నాటుక్క పట్టినకత్తినిఁ జక్కఁజేయుదము. అప్పుడు నావిక్రమమెంతోగనిరెదవు.

విలాస:—పద. నీ శిబిరమునకుఁ బోవుదము. అచట నీకుఁజక్కఁగ నేర్పెదను. (వెళ్లుదురు.)(స్వగతము) శ్రీమంతులమర్యాదను గాపాడుటకై యీపిఱికిని దన్ని ముదిరినకూతునిఁ జేయఁ జూడవలెను.

(నిష్క్రమణము)

## ద్వితీయరంగము.

### కుసుమమందిరోపవనము. ధైర్యధర శీలధరులు.

ధైర్యధర:—శీలధరా! దీనిఁగనుము. నేను వచ్చినకొన్ని దినములనుండి చూచుచున్నాను. ఈ యింటిలో మఱల జనులు వచ్చి చేరినారని తోఁచుచున్నది.

శీలధర:— మీకయిన విజయకారణంబున శత్రువులవలని యేమియు సాగకయున్నది. ఈవిశ్వాసము లోకుల మనములందుఁ గూర్చున్నది. యుద్ధసమయములోనుండిన శాత్రవభీతిచే నిల్లు వాకిలి వదలిపోయిన జనులు మఱలఁదిరిగిరాసాగినారు.

ధైర్య:— అవసరపడి యిటువచ్చుచున్నారు. అవసరపడ నేల? నామంది కలిగినది యీ యాతప్పితము. అగ్నవ్యసనుఁడనై కొంతకాలము నేనుండ సైన్యవ్యవస్థ యించుక చెడినది. ఆకారణమున శత్రువులకు సమయము దొరకెను. కాని నేను వెంట నేరాకయుండినచో నీ చోరులబాధ యధికరుగుచుండెను. నేనిపుడే నేనిమిది దినములుగ నెటుదిట్టముగ కట్టుబాటొనరించితినో యటులనే మఱియుఁగొన్ని దినంబులుండిన రౌడలఁ జోరులబాధ బొత్తిగనిలిచిపోవును.

శీలధర:— ఆ చోరులనాశనము చాలినంతయ్యెయుండెను. నిన్న మొన్నటినుండియు వారు పునఃతలయెత్తిరి. కారణమేమన మేఘములు చంద్రునిఁ గప్పివేసినకారణమున రెండుదినములుగఁ జీకటి బలము వారికి సాహాయ్యపడినది.

ధైర్యధర:— నేఁడు సైతము మేఘములు వ్యాపించినందునఁ జంద్రుఁడు భయపడినట్టుతోఁచెను.

శీలధర:— వానినిఁజూడుము. ఆ కాలమేఘము నాలుగు దిక్కులవ్యాపించుచు వచ్చినవి.

ధైర్యధర:— దొంగలచేతఁ జిక్కిన మనుజుఁడు దీనముద్రను ధరించి యితరుల సాహాయ్యమెటు చూచుచుండునో, యారీతిగఁ జంద్రుఁడు దీనతచేనిపుడు నాదిక్కునఁజూడసాగెను.

శీలధర:— నిజము చంద్రుఁడిపుడు దీనత్వమందినాఁడు. చంద్రా! ఇంతటి దీనతచే మాదిక్కున నేల చూచెదవు. ఆమేఘములమండినిన్ను మేమెటురక్షింపఁగలము?

ధైర్య:— మేఘము లెటుపైనఁబైననెక్కివచ్చుచున్నవిరయో యటులనే యా చంద్రుఁడు బొత్తిగ భయపడుచున్నవాఁడు. చూడుమెటు వాని మోము తెల్లఁబారిపోయినది. (భామిని వనములో వచ్చును) శీలధరా! ఇదిరెవరు? చూచితివిదియా? ఇదిరెవరు?

చ. జలధర చోరులాగి తనచంద్రిక సంపదఁ గొల్లఁగొట్టఁగాఁ
గలకని భీతిచే జలజ కాంతములన్ శశిడాఁచె దానినిన్
జలము చమున్ సరోవమున సర్వదిశల్గని వేసరిల్లి భూ
వలయము వీడుచున్ గుముద బాంధవుపైఁబడె భీకరమ్ముగన్.

శీలధ:— ఇదియెవరుండును? ఎవరికిఁ జేరినదియో? ఇంతటి రాత్రిలో వనమున నొంటరిగ నేల సంచరించు చున్నదియో? ఈ విషయము విచారింపఁ దగినదిగనున్నది. శాత్రవచోరు లంధకారముననే సంచరించు చుందురు. అదిదీనికిఁ దెలియదేమో?

శీలధర:— ఏల తెలియక యుండును? "జాగ్రత్తగ నుండుఁడి" యనెడి యాజ్ఞ సర్వు లెఱుంగుదురు.

ధైర్యధ:— తెలిసియును ధైర్యమున సంచరించు చున్నది. మన స్త్రీ లిటు ధైర్యమున నుంటఁజూచి శాత్రవ చోరులాశ్చర్య పడుదురు కాదా?

శీలధర:— ధైర్యకారణమున నీటువనములో సంచరించు చున్నదియని పలుకుట కంటెను నీపరాక్రమముపై విశ్వాసముంచిన యాఁడువారైనను శాత్రవభీతి లేనివారయి యున్నవారని పలికినచో యుక్తియుక్తముగ నుండును.

ధైర్యధ:— శాత్రవభీతి దీనికి లేకయున్నను, నీ మేఘభీతి యయినను నుండవలెనుగదా? దీనిలక్ష్యము మేఘములపై లేని కారణంబునఁగదా వనములో నిలిచినది. శీలధరా! పద దానిసరసకుఁ బోవుదము. ఇది యెవరు? ఎవరిది? వనములో నేలనిలిచెను! ఈ విషయములన్నియును విచారించి కొని వచ్చెదము. ( సమీపించి ) శీలధరా! విచారింపుము సర్వమును విచారింపుము.

శీలధర:— అమ్మా! మా సేనకెల్లముఖ్య సేనాధిపతియగు ధైర్యధరుఁడు మిమ్ము విచారింపుమన్నాఁడు. మీ రెవరు? ఎవరివారు? ఇచ్చటికేల వచ్చితిరి? శాత్రవభీతి మీమనసుంటదా? తుదకు వానకుఁ దడియుదుమను భీతియైనను లేదా? మీయింటిలో మఱియెవరున్నవారు?

ధైర్యధ:— శీలధరా! ఒకటేసారి యెన్ని ప్రశ్నలడిగితివి? చోరులయొక్కయు మేఘము యొక్కయు భీతి యామెమనమునంటనిరీతిగనున్నది. దానికిఁ జేరి కాకనీ ప్రశ్నల దెబ్బలేల? (భామినితో) భయపడఁ గారణములేదు. స్వేచ్ఛగ నీవిచారమును దెలుపుము.

భామిని:— మహారాజా! కొంతకాలమునకు మున్ను వానభయముండెను మీరిచటికి వచ్చినపిదప నామేఘములు సైతము మఱలిపోవుచున్నవి. సర్వసేనాధిపతియగు ధైర్యధరుఁ డిచటనుండఁ జోరులభీతి యెవరికిఁ దవులును? మిగతచోరులభీతి లవలేశమైనను నామనమును స్పర్శింపదు. నాయింటిలో నొకకత్తి పుడుకయైనను జోరులకుఁ జిక్కినది లేదు.

క. ధనరహితమైన నామన
ముసఁజోరుల భీతియెటుల మూడును? గ్రహణం
బునకుఁ సూర్యేందులు భీ
తిని రుచి చెడనంటి శమ్యదీపము చెడునే.

ధైర్యధర:—ఇదియంతయును నిజమే. నీవెవరు? ఎవరిదానవు? నీపేరేమి?

భామిని:— నా పేరువనమాలయని యెదరు. నా చెల్లెలుపేరు పుష్పమాల. మాతండ్రితోఁగూడ మేము మువ్వుర మీయింటిలో నుందుము. యుద్ధసమయమున మేమిచటికి దూరముగనుంటిమి. అయిన మా యుదరపోషణ మీ వనమునుండి కావలసినదిగనుండు కారణంబునను నిదితప్ప మాకుఁ గడుపు నించికొను వేఱు మార్గము లేనందునను నింతటి త్వరితముగ మఱలివచ్చితిమి.

ధైర్యధర:---వనమాలా! దుర్లభధనము కాదు. నీవును నీచెల్లెలును నీతండ్రికి గొప్పధనము. అటులఁ దెలిసికొనుము. అట్టిధనము చేతికి దొరకకనినచో శత్రువులును దాని నపహరింపఁజూచెదరు. మిత్రులును దానినపహరింపఁజూతురు.

భామిని:--శత్రువులనుగుఱించిన దండోరా వినినపిదప నట్టిభీతిమా నాయన్న మఱల జాగ్రత్తగనుండుఁడని మాకనేఁడు చెప్పియుండెను దివసాంత్యమువఱకు మా నాయన్న వనములోఁ బనిఁ జేయుచుండును. కావున హెచ్చరికగఁ గావలియుండుపని మాయందే యున్నది. పుష్పమాలగాఢ నిద్రలోనున్నది. నాకు సునిద్రపట్టునను భయమునఁ దోఁటలోఁ దిరుగుచుంటిని. అంతలో మీరు వచ్చితిరి.

శీలధర --- మీరు కావలిగాచుపని సేయుచున్నారో యేమి?

భామిని.---నిజము. అటులనుటకు నేయభ్యంతరములేదు.

ధైర్యధర:-- శీలధరా! కావలిపని నాడువారికైఁ బెట్టుట సరి కాదు. ఇదియేనా నీ జాగ్రతి?

శీలధర:--. నేను కావలి పనిమీఁదివచ్చి కూఁతమట్టుగారమున నిలిచియుంటిని. అనఁగాఁ గావలితిరుగు పనికిఁ గారణమేమియుఁ గనపడ లేదు. అమ్మా మీరు క్షేమముగఁబోయి నిద్రింపుఁడి. మీ కేభయమును లేదు.

భామిని --- నేనుకొంచెము కావలిపనిపైనుండినచో మీ కేమి చెడుగు?

ధైర్యధర.--- ఛే. ఛే.

కం. యువతీ ధర్మము కావది
బవరపు దుఃఖంబు సైఁచుపని సేనకగుఁన్
బువుఁబోఁడ్లకు నక్కార్యము
లవలేశంబైన నిడఁగ లగ్గగు. నెటులన్.

భామిని:—అది యేమియు లేదు. మాయూఁదువారిపై నట్టిప్రసంగము రాదు. నేనింతవఱకు రణభూమికి దూరముగ నుండిన కారణంబున నాకు నటుల నేతోఁచుచుండెను. ఈప్రదేశము సమీపించిన తోడనే భయముగుదుఁ గాల్లపడఁకు చుండెను. ఇంకఁగొన్ని దినంబులుండినచో నాకుభయము దోఁపక యుండును.

ధైర్య:— వనమాలా: నీనిర్ధారణమటు లుండినచోఁ గావలియుండుము. పిదప నీవింటిలోపలఁబోయి జాగ్రత్తగ నుండుము గాని. ఇదియుచితమని దోఁచుచున్నది. పొమ్ము. శీలధరా: ఇతర శిబిరములలో నీవెంత భద్రముగ నున్నావఁడవో నేను జక్కఁగఁ జూడవలసినదిగ నున్నది. నేనును వచ్చుచున్నాను. అవశ్యకము పడినరోదల గట్టిగనఱవక యుండవలదు. కావలి యుండుస్థలము కూఁతమట్టు దూరములోనే యున్నది.

భామిని:—బహుశా యగత్యము పడదు.

ధైర్యధ:— దైవమటులనే చేయించుఁగాత. శీలధరా: వెళ్లుము, (వెళ్లుదు) ఇచటనీవానరించిన యేర్పాటు బాగుగలేదు, ఆవన మాలపైనఁ గావలిజరు పుంచుట పనిగాదు.

శీలధర:— (స్వగత) కావలి సంబంధములో సేనాపతియొక్క కల్పన, వనమాలినిం జూచినప్పటినుండి మఱచినట్లు తోఁచుచున్నది.

ధైర్యధర:— దానినిఁ జూతుము. ఇంకను గృహములోనికి వెళ్లకయున్నది. కావలి కాచుచు నిలిచినది.

శీలధర:— తమరు పరీక్షింపఁదగిన శిబిరములింకను ననేకములున్నవి. ఇతరదిక్కునకుఁ ద్వరలో వెళ్లుదము.

ధైర్యధర:— చూచుచూచిన్నది యిటులే నిలిచినది. ఇంటిలోనికిఁ బొమ్మని చెప్పవలెనని నాకుఁదోచుచున్నది. కావలిలోనింకను నిలిచినది.

శీలధర:— మహారాజా: నేనుస్పష్టముగఁ దెలిపెదను. ఇంకను పరీక్షింపఁదగినపని చాలగనున్నది. సర్వకార్యములు ముగిసిన పిదప మఱల నిచటికి వత్తము.

ధైర్యధర:— అటుకాదు. అదియటులనే నిలిచియున్నది చూతుము.

శీలధర:— మహారాజా: ఈ వనమాలియింటి స్థలము కావలిఁగాచుచుండఁ, జోరులు దానియిల్లుఁగొల్లఁ గొట్టుటకు మాఱుగ, నదిమాత్రము మీ మనమును దొంగిలించెను. ఈవార్త సేనలో సంతవ్యాపించును.

ధైర్యధర:— ఛీ. ఛీ. ఇదినీ నూతనకల్పన. నీజాగ్రత్తయొక్క లోపమును మూసిపెట్టుటకై యీ కల్పన యనితోఁచెదు. పదపోవుదము. పద.

(పోవుచుఁ దిరిగిచూచి) ఏమిది. ఇంకను నాస్త్రీయచట నేనిలిచినది. (స్వగ) వీఁడిప్పుడు నాదిక్కునఁ జూడకయున్నవాఁడు. ఇంకమనది యిచట నేనిలిచినది. నాదిక్కునసే పైపైనఁ జూచుచున్నది.

ఉ. ఈనవమోహనాంగి చపలేక్షణ తీక్ష్ణపుదేమి పల్క, నా
మానసముం హరించె ననుమానము లేక, భయంకరారులుం
గానని నామనంబెటులగాంచెనొ యీ వనమాలి, నే నెటుల్
మానసరాహితుండనయి మానవకోటిఁజరింతు వెఱ్ఱినై.

(ధైర్యధరశీల ధరులు వెళ్లుదురు.)

భామిని:— (స్వగతము) నే నేలయొక్క స్థలమున స్తబ్ధనయి నిలిచితిని? వానినిఁజూచితిని. వాని కనుఁగవ కనుకట్టువిద్యచే నేనీస్థలమునుండి చలింపఁజాలను. అదెకను. అదెకనుము. ఎంతదూరము పోయినను పునః వెనుకకే మఱలిచూచుచున్నవి. అయిన నే నెందుకువానినిఁబలుమాఱు చూచుచున్నాను. వాఁడు చూచుచున్నాఁడు కావున నేనును జూచుచున్నాను. కాదేని నే నేల వానిదిక్కుఁజూడనిచ్ఛయింతును? నాయన్నగారును సోదరియును నందఱును నాచూపును జూచి ద్రవ్యదృష్టియని యనుచుండిరో యీ యీ నాదృష్టి దానినుండి మారనేల? ద్రవ్యము దిక్కునకే నాదృష్టి యీడ్చుచుండినది. అదే నాకిపుడు ధైర్యధరునిదిక్కునకు నొక్కరీతిగఁ బఱుగిడుచున్నది. ఇది చిత్రముకదా యేమి? చిత్రమైనను నేమి?

కుసుమ:—నీయంతట నీవే దీనినిఁ జూడవలెను. నీవీయుక్తులు చక్కఁగ నెఱిఁగిన దానవుగావు. సేవా ధర్మము గహనమని పెద్దలనరా? అనేక వేళలలో నీవు పనికిరానిమాటలనేకము లాడుచుందువు. ఎపుడు మాటలాడవలెనో యపుడు మూకిదానవయ్యెదవు.

భామిని:—కుసుమా! నీవు చింతసేయవలదు.

ఉ. నాలుకమూకయైన, నయనంబుల మాటలనాడనేర్తు; ప్రే
మాలయ మందు నాథుని సాదరబుద్ధిని నిల్పనేర్తు; నే
మేలుగనన్ని కార్యములు మిక్కిలి యక్కర సేయనేర్తు; నా
మేలిమి నే నెఱుంగ నెటు? మేలగు మాకు సరోజలోచనా.

కుసుమ:—ఉండినటుల నే సేవకులకందఱికిని సెలవిచ్చిన కారణంబున పని హెచ్చగును. నీ వీకోమల దేహమున నీదిక్కు పుల్లనాదిక్కు నుంపఁజాలని దానవు. కష్టకార్యములు చేయఁజాలవు. స్వామి కోపగించినచో నిచటనుంటయు కష్టమగును.

భామిని:—ఏమే! నే నిచ్చట సకలకార్యములు నిర్వహించువారి నెటులయిన సుప్రసన్నులఁ జేయఁగలను.

కం. పదముల సేవింతును మృదు
పదముల ధవునంతరంగ పద్మమ్మున ష
ట్పదమయ్యెద ననురాగా
స్పదయ యుతుని యెదను వలదు భయమింక నీకున్.

[నిష్క్రమము].

## ద్వి తీ య రం గ ము

### ధైర్యధరునిశిబిరము - భామిని - ధైర్యధర.

ధైర్యధ:—నేనిన్ని దినములు సేనాపతిగఁ గార్యములొనర్చు చున్నానుగాని నేఁడు నే నొనరించినంతటి తప్పునెన్నండు నొనరించి యుండలేదు. పడినపంచు చిక్కినఁజాలునని యెన్ని శీలధరుఁడెటు వెళ్లిపోయెను! వాఁడు నాసరసలేని కారణంబున, సకలసైన్యమును ననుఁజూచి లోలోన నవ్వుచున్నారు. సేనయంతయును నాకువందనములిడు సమారంభములో నేనువనమాలిని, నాసరసనుంచికొంటిని. ఇదియ గొప్పతప్పుగఁ బ్రారంభమాయెను. వీరులు నాకు నమ్రులైరి. ధైర్యధరా! భళి-భళీయను గౌరవశబ్దమొకటి యందఱును ఘోషించుతఱి నైననీగౌరవమును గాపాడికొనుమనము నీకుఁ లేకపోయెనా? సైనికులు విషయమే మను కొనుదురు? దూఁడుపదకముల యధికారియయ్యు నిరువదైదు లక్షల జహగీరుదారుఁడయ్యు సేనాపతిగ నిక్కనని సర్వులు దూషింతురు. నేనేమి సేయుదును? వేలువేలు దారుల నుండి సేనవచ్చి వందనములర్పించు వేళ, వనమాలి తన దొంగచూపుల నన్నుఁ జూచెను. కపోలములు స్మిత చంద్రికలు ప్రసరించునటుల చిఱునగవునగుచు నన్నెద్దియోయొక ప్రశ్న విచారించుచుండెను. వీరుల నెవరినిఁ జూచినను వనమాలివేషమును ధరించివచ్చినవారింబలె

నా కగపడుచుండిరి. వీరపురుషులారా! మీరెఱుఁగ నేను కృతాపరాధిని. సహస్రాపరాధిని. నాకుఁ జిచ్చిపట్టించిన యీ తరుణీవేషము నా మనమును భ్రమింపఁజేసి మిమ్ముఁజూచు నపేక్షకంటెను, మిమ్ము లక్ష్యముసేయక యీ వనమాలీముఖకమలమును నిర్లజ్జతఁ జూచుచుంటిని. మఱల దాని యస్పష్టమైనట్టియు నర్థోచ్చారణము గలిగినట్టియు బ్రశ్నలకు నోటికి వచ్చినరీతిగ నుత్తరములిచ్చుచు నిలిచితిని. ఇదిమీకును నాకును మన యోధుల నడవడికకును శ్రేయస్కరము కాదుకదా? వనమాల యించుక దూరముగనినపుడు, దీనితో నింతగ మాటలాడునది నాకుఁ దోఁచనెటులయని నా యంతకు నేనే విచారింపసాగితిని; మఱల దాని కపోలరుచి తరంగజాలము లొక్కొకటి యూఁగుచు నా నాలుకను నటింపఁజేయుచుండెను. దానిలజ్జయు నామాటలు నింకిపోయెను నిజము. ఇది నిజము.

ఉ. ఫాలతలేందుమండలప్రభల్ స్మరసాగర వీచులెచ్చగాఁ
గూలఁగఁజేసె నామనముఁ గోమలి యీ వనమాలి యందునన్
వాలకముగన్నుఁదోయి నిడువాలుటుగా నొనరించునాహృదిన్
జాలుగఁ గ్రుచ్చి ధీరతను జాల్కొనఁజేయఁగఁ జాలెనీరుగన్.

నా మస్తకముపైనుండు నా పగడీరుమాలయును చంద్రుని సాన్నిధ్యమువలన నింతటికష్టములొందవలెను. ( పగడీ చేతిలోనుండికొని ) చంద్రా! నిన్ను నేనితతగ సన్మానించి శిరముపై నిడికొనిన యుపకారమునకు బదులు నీవు నన్నింతగఁ గారించెదవా? ఒకనమయమున నున్నత పదవికి హెచ్చి శ్రేష్ఠుఁడనై లినని యున్ని తునకు నాశిరముపై మిరి ఘనములు నూరకపడలవుగదా? దీనియనుభవము, చంద్రా! నీవు నాకుఁ జక్కఁగఁ దెలియఁజేసితివి. చూడుము. శిరమునుండి క్రిందికి దించినవెంటనే నీవెంత బలహీనుఁడవై తిరిగెదో చూడుము. భద్రతగ దిట్టించి నన్నుఁజూడుము. నీనుండి నాకు మదనబాధ యెట్లుహెచ్చునో చూతునిప్పుడు. నేఁడు నేనే శుద్ధుఁడనై తిని. దీనిని విచారింపవలెను. శీలధరుఁడును మఱియు నితరసేవకులును నా సెలవందక వెళ్ళిరెటులు? వారికి సెలవియ్య నీ వనమాలిరెవతె? ఈ చంద్రునిఁ దలనుండి దించినాను. అదియిపుడు కానిమ్ము. ఎంత బాధించెదవో చూడుము. గొప్పసేనకు సేనాపతినైన వాఁడొక పిల్లలాడు బొమ్మయని తలంచితివియా? అదియేమి యింకను రాకయున్నది? శీలధరుఁడును నితరసేవకులును నెటువెళ్ళిపోయిరి? వారికి సెలవెవరిచ్చిరి? నే నొంటరిగ నిచట నెటులుండుదు? నా యందుపు రెవరుడీయువారు? ఎవరును లేరా యిచట? అందఱును చెవుటివారలై రారేమి? ఏసేనకు లిచట లేరాయేమి? ( పరదాలో. మహారాజా! నేనిపుడు వచ్చుచున్నాను. నా చేతనున్న విననకఱ్ఱ నేనిపుడే యెచటనో యుంచినాను. చక్కఁగ వెదకితెచ్చెదను. ) మంచిది మంచిది. వేగమెరమ్ము... హా! హా! ఏమిచమత్కారమిది. " వేగమెరమ్ము "ను శబ్దము సైతము కోపబలమున నా నోటరాకపోయెను? హా! ( పరదాలో ) ( " నేను వేగమె వచ్చుచున్నాను మహారాజా " ) అంతటి యవసరపడవలదు. సావకాశముగ...... త్వరగ...... ఏమిరా!...... నా కోపమంతయును నొక్కసారిగ నెటుపోయెను? వనమాలా! నీ యొక్క రెండుశబ్దములే నాకు శాంతత్వముఁ గల్గిం

చెను. నీవనవిసిరి చల్లఁజేయనేల? పూర్వకాలమందలి రథుల మహారథుల ధనుష్టంకార ధ్వని వినినంతనే ముక్కలిడిసేన వణకుచుండెను: బాణ ధనుష్టంకార సాహాయ్యము నందకయ, వనమాలా! యీ వేళలో నంతటి పరాక్రమము నాపైఁ జూపితివి. నా యావేశము, క్రోధము, నా రౌద్రత్వమును నీ శృంగారముచే నొకదెబ్బనఁ బోఁదోలితివి. నవరసములు ప్రేమాలయమునుండి ప్రేమతేజమును బెందుమ నా ప్రేమను జుట్టుముట్టియుండునని నిజము. కానిచో ప్రేమయొక్క ధ్వనిమాత్రము వినినతోడనే దీనదాసునిబలె నా క్రోధమంతయు నడఁగిపోవనేల? ప్రేమముఖము నాకవ్యాహతముగ నిపుడందనాయెను. ఇపుడు యుద్ధబాధలు లేవుగదా? ప్రేమచే విమఁబడినఁగదా కరుణరసబోధ హెచ్చును. సర్వవిచారములకును, సర్వవికారములకును, సర్వయుద్యోగములకును, సర్వగుణములకును మూలాధారము ప్రేమయే. హెచ్చనేల ప్రేమలేనిచో జగమందేలేదు. ఇట్టి ప్రేమవలలోఁబడిన సేనాపతి ధైర్యసింహుఁడు సర్వసైన్య సమక్షమున నేమోయించుక శృంగారచేష్ట యొనర్చినందులకు సేనయంతయు నవ్వరేల? సైన్యమూరక నవ్వరనిచో నాకు నంతటి విషాదము కలుగనేల? నిజముగ నాదేమియుఁ దప్పులేకున్నను నేనూరకె నా యానందమునుఁ బోకార్చఁజూచితిని. అట్టి యానందము నాకుఁబోదెను. ఆసుఖము దారి బహిరంగముగ ద్రొక్కవిచోఁ బురుషార్థమేమియుఁ గనఁబడదు. ఇపుడు వనమాల వచ్చినతోడన దానికి స్వచ్ఛముగఁ దెలిపెదను. "నీవు నవ్వులకు నెలవిడినందులకు నేను బొత్తిగ సంతసించితిని" యని తెలిపెదను.

గీ. జనులనయనోత్సవంబుగ సర్వరసము
లోకశృంగారరసమున నొప్పుచుండు
నింద్రధనువున వర్ణము లేకమైన
శ్వేతవర్ణంబునగుచును జెలువుఁగనవె.

ఆఁ జెగనుము. వనమాలవచ్చెను. క్రోధమునువస్తు వేగ్రాహ్యములోనిదియో నాకిపుడు స్మరణకు నైతమురాదు: ( భామిని ప్రవేశించును )

భామిని:— నానుండి యిందుకే తప్పయినది. శ్రీ నీవన యెచటనుంచితినునది స్మరణకురాలేదు. ఇఁక ముందు ప్రతియొకపదార్థమును మంచిస్థలములోఁ బెట్టఁ బ్రయత్నించెద. మముఁబోలు బీదలయిండ్లలో వస్తువులుంచు నవశ్యకత యేమియునుండదు. ఏవస్తు వెచటనుంచినను మఱపురాదు. ఇంతటి శ్రీమంతత్వమునుఁజూచి నేను భ్రమజెందితిని. తత్కారణంబున సేవకావృత్తికి నంతరాయంబు గలుగుచున్నది. క్షమింపవలదు.

ధైర్య:—( స్వగతము ) నేను కోపగించితినని తెలిసి యిది మంచిమాటలాడుచున్నది. లేనికోపము దెచ్చికొని కొంతకాలము మౌనమునుండెద.

భామిని:—( గాలివిసరుచు ) నాపైఁ ( ముఖముద్రిప్పి కూర్చుండును ) గోపము గీపములేదుకదా? నాచేత నెంతవరకగునో యంతవఱకు సేవచేసెద. పరాయిస్థలమున శ్రీమంతునియింటిలో సేవఁజేయుచు నెటులుండవలెనో దాని నిచట నేర్చికొనినయెడల, నా నాయన్నకు సం

తోషమగును. అతఁడు ముందు నాకేమగునోయను చింత దూరమగును. మహారాజా! నిజమే విశేషకష్టపడి నానుండి సేవపుచ్చుకొనుఁడి. సేవాధర్మము నేర్పినచో నే మీ యుపకారము స్మరించుచుండెద.

ధైర్యధ:—వనమాలా! నీవు సేవావృత్తికి జన్మమెత్తితివని నాకుఁదోఁపదు. నీవిటు గాలివిసరుచుంట నాకెటులనోయున్నది.

భామిని:—ఎచటఁ దప్పొనర్చినను నాతప్పుఁ దిద్దుచుండవలెను.

ధైర్యధ:—గొప్ప తప్పయినది.

భామిని:—అదియెద్ది?

ధైర్యధ:—నీవిటు కూర్చుండవలెను. నేనటునిలచి నీకుఁగాలి విసరవలెను. ఇచటఁ గూర్చుండుము. నేను జూచి గాలివిసరెద. ఏమి? దూరముపోయెదవు? కోపమువచ్చెనా యేమి? (స్వగత) నేన వసరపడి యేమోయొకటి యంటిని.

భామిని:—పెద్దపెద్ద శ్రీమంతులు స్వేచ్ఛాచరులు. వారి చిత్తవృత్తి ననుసరించుట నిందుకష్టమని నా నాయన్న చెప్పుచుండెను. తాము మూఁడుపదకముల యోధులు. ఇరువదైదులక్షల జహాగీరు దార్లు మూఁడుపదకముల యోధులు. మీరా, గాలివిసరువారు? నేను విసరించుకొనుదానవా? శ్రీమంతులు తామేకష్టపడువారునుగారు. వారేపని చేసికొనినయెడల నముఁబోలుబీదది యెటు పనినేర్చికొనవలెను?

ధైర్యధ:—నీవు పనినేర్చికొని యేమిచేయవలయును?

భామిని:—ఎవరోయొక శ్రీమంతుగారి రాణివద్ద సేవకు నిలుపవలెను. నేను విలాసధరుని యాశ్రితులలో నుండుదానను. ఆ మహారాజును నాకుఁదెలియును. నా నాయన్నమనసులో విలాసధరుని పెండ్లాము చెల్లెలగు భామిని.........బీదలజన్మగాధ శ్రీమంతులచేఁ జిక్కుటయకదా? నేనిది మఱచితిని. నాతప్పు క్షమింపుఁడి. ఇఁకముందు తమకేలాటి శ్రమయిడను.

ధైర్యధ:—అదియెటులగునే? ఆ భామిని పేరు వినఁగనే నా కాగ్రహమువచ్చెను. ఆ విషనామము వనమాలీ మధురాధరముల నుచ్చరించుటవల్ల నాకంతటి దుఃఖము ఘటిల్లలేదు. ఆ నామము నీ ముఖకమలమునందెంత తిరుగుచుండినను నీ యధరామృతమునందెంత పొర్లాడినను, విషము విషమేను. మంచిది. ఇఁక నీముందు వార్తఁదెలుపుము. ఊరకైతివేల? ముందు తెలుపరాదా? వనమాలా! నాసరసనిటు మానమువహించుట యనఁగా భామిని విషనామము నాచేఁ బలుమారు లుచ్చరింపఁజేయవలెననికాదా? దానికి సిద్ధుఁడుగ నున్నాను. అటులైన ముగిసెనా? ముందువార్త తెలుపుము. ఎన్నిమారులు భామిని భామిని యనవలెను చెప్పుము. చెప్పఁగూడదా? భామినీ భామినీ భామినీ.

భామిని:—ఆ భామిని సేవకావృత్తిలో నన్నుంచవలెనని నాతండ్రి సంకల్పము శ్రీమంతులయింటిలో నెటులుండవలెననునది నేర్చికొనుటకు నిచటఁ నన్నుఁజేర్చెను. మీనుండి నాకగు నుపకారమిదియేను.

ధైర్యధ:—నీవు నాసేవ నీవయి చేయుచున్నావు. ఇది నాపై నీయుపకారము. ఆభామినిసేవలో

కుండు కారణము నీకేమియును లేదు. నీతండ్రి నీకట్టిపని ముడివేయవలెననిన నేనే నీ తండ్రి వద్దకువచ్చి నీ విషయమున:—

భామిని:—నా నాయన్న చెప్పినను చింతలేదు. నేనేమో మీకు ముందుకాఁబోవు భార్యవద్ద సేవకురాలనై యుండెద. భామినివద్దనుంటకు నాకు నెంతిమాత్రమిచ్ఛలేదు. అదియునుగాక యీ భామిని నిండుగర్విష్ఠియని నే విన్నాను.

ధైర్యధ:—శ్రీమంతుల గర్వముతో నిండినదని. నీకును దానికిని నొకక్షణము సరిపోదు.

భామిని:—చూచినవారినెఁ బోఁచినట్టెల్ల యీడుచుండును.

ధైర్యధ:—లోత్తిగ నిజమది. బీదలనది కసవుగఁజూచును. దానిగాలి సోకుఁడంతదూరమునకైన నిలువ నెన్నను.

భామిని:—పెదవిమీద పడిన నేరెనుపండును, నాలుకలోనికిఁ బోయునంత, దానిసేవఁ జేయవలని వచ్చును.

ధైర్యధ:—ఆ సోమరి శ్రీమంతులు బీదలయెముకలు నిజముగ జన్మమెల్ల తినవారు. నీ చెప్పుకేగాని యీ భామిని సేవకారినుంటివేని యొక రెండుదినములలో నడుమువిరిగిపడుదువు. నీవంటి సుకుమార దేహము మృత్యుముఖమునఁ బోయు పాతకమునకు నీతండ్రి గురిగాక మానఁడు.

భామిని:—మహారాజా! ఇదినిజము. అటులగును నిజము. అమ్మా వలదు నేనా భామినీసేవలో నుండనే యుండను. ఆ గర్వ శ్రీమంతుని యీపిల్ల నాప్రాణము నాకు వలదనిపించును. శ్రీమంతుల యింటి నౌకరియనఁగా, ప్రాణకంటకము. శ్రీమంతత్వములో నిట్టిదోషము దైవము గల్పించియుండునని నాకుఁదోఁచెను. శ్రీమంతుఁడయి రెండుదినములయినను సేవకులించుక సమీపమున లేరేని వెంటనే వారిప్రకృతిమారును. ఒకవేళ గొప్పయుద్ధమున నపజయమయ్యెనేని సేవకులపైన ఘర్జించుచుండురు. మఱల నెవమప్రక్కకు వాలినరుమాలను గుడిప్రక్కకుఁ బోయును నొకవనమాలి, కావలసివచ్చును. మహారాజా! వనమాలీయవతారము రెండుదినము లలో ముగియును. ఈ యుపకారము దైవముపైనున్నది.

ధైర్యధ:—ఎవరియుపకారము? ఇఁక నా చెవులుపిండి బుద్ధిచెప్పువారెవరున్నారు? కన్నులుమందువేళ పురుషునకుఁ జూపకమందువేసి స్వచ్ఛముచేయఁ యుక్తి యీఁడువారే సాధించునది. ఏదేవుని యుపకారము నీపై నిలిచినది? చెప్పుము. సిగ్గువలదు, పలుకుము. నాయందేదోషము నీకగపడినదో యాదోషమును బలుమాఱుగ్గడించి తుదవఱకుఁ బలుకుచుండుము.

భామిని:—తమదోష మించుకైనను నాకుఁదెలిసియుండినచో నేనై సంతోషముగ మిము సేవింప నేల వచ్చుచుంటిని? మీయందు దోషమేమియును లేదు. శ్రీమంతత్వమింతుక యగపడుచున్నది. మఱియు శ్రీమంతుల భామినుల నైజస్వభావము వదలింపనైనను, లేక సేనాధిపతుల పాదములందుఁ బడియుంటనైనను నుండుదానను. అనఁగా దైవముయొక్క యుపకృతి నాయందు హెచ్చుగనున్నది ఎవనికోయొక శ్రీమంతునకు నన్నిచ్చి వివాహముఁజేయు కోరిక నాతండ్రికిలేదు. అటులనే నాకును శ్రీమంతుని వివాహమాడుతలంపు కలనైనను లేదు.

ధైర్యధ:—పృథ్వీధర మహారాజుగారి సేనాపతి, మూఁడుపదకముల యోధుఁడుఁ నిరువదైదులక్షల జహాగీరుదారుఁడు. మఱియు శ్రీమంతుఁడుగ నేనున్నాను. ఈ ధైర్యధరుఁడు, యోధుఁడును కాదు.

జహాగీరుదారుఁడును గాను. శ్రీమంతుఁడును గాదు. అట్టి సేనాపతివి నీవు తుచ్ఛముగాఁ జూచె నేల వలఁదుము. ఈధైర్యధరుఁడు నీకంటె దరిద్రుఁడు. దీనికి మఱువకు.

భామినీ:—తుచ్ఛమును గొప్పను భేదించుపట్టిబుద్ధి యూఁడువారికేలవచ్చును? నాకంటికేమో ధైర్యధరుఁడే యోధుఁడన్న యగపడును. జహాగీరుదారుఁడని యగపడును. శ్రీమంతుఁడని యగపడును.

ధైర్యధ:—ఆది బొత్తిగాఁగాదు. నేను బీదవాఁడనే నేను. జాజన్న మిజేరితిగాఁ జేరవానిగ నుండెదను. ఇదియు వాయిచ్చు. " ఇరువదైదులక్షల జహాగీరు నాకు లభించెను. మఱియు పీరుఁ వస్త్రములు నా శరీరమలంకరించెను. ఇంతవిభవముగల శ్రీమంతత్వమును సుఖసాధన, చక్రములో నేను జిక్కితిని " ఇటు నీవు తెలియకము శ్రీమంతత్వము నేను స్వీకరించినది శ్రీమంతులు పనిసేయు వారుగ నుండవలెననియుఁ బరికి విలాసములోఁబడి పోర్లునటులఁ జేయుటకును మంచిపను లొనరింపఁజేయుటకును నిచ్ఛయించితిని.

భామినీ:—ప్రతియొక శ్రీమంతపురుషుఁడును శ్రీమంతత్వ ప్రారంభమునఁ బలుమాఱు లిదేరీతిగాఁ బలుకు చుందురు. కొన్ని దినములకా శ్రీమంతత్వమును గ్రహించినపిదప, నితర శ్రీమంతుల సహవాసము హలాలాత్రములందయి, యిట్టివాడును గర్తవ్యకార్యములువదలి నిజముగ శ్రీమంతుని దుర్గుణములనాశ్రయింతురు. తమకిప్పుడా శ్రీమంతత్వము వ్యర్థమైనది. ఇది నూతన శ్రీమంతత్వ లక్షణము.

ఉ. నీరధిఁద్రోసెభర్తనవె నీరజమందిర కాదె? విశ్వస్ర
ద్వారిజనేత్ర భర్తముఖవారిజపజ్ఞిని నాట్యమాడెఁగా?
మారవిరోధిమస్తకము మానకత్రొక్కనుగాదె గంగ? యా
తీరున, లక్ష్మి పూరుషులఁ దీవ్రగతిన్ దలత్రొంచఁ జేసెడిన్.

ధైర్యధ:—వనమాలా! నీవుపలుకునది యబద్ధముగాదు. అయిన భాగ్యగలిగల బీదవాఁడు శ్రీమంతుఁడైనచో శ్రీమంతత్వమంతగాఁ జాటింపఁడు. పనికిమాలిన శ్రీమంతులు దుర్వ్యసనములందు శాశ్వతముగఁ బడియుండుగాని వాఁడు పడఁడు. స్వతః శ్రీమంతుఁడైనవాఁడు పనికిమాలిన శ్రీమంతుల వైభవగర్వముడఁపఁ జూడవలెను. సజ్జనుల శ్రీమంతత్వము రోగముపైన సుజనుల శ్రీమంతత్వముతప్ప తెండవమూర్తి రొంతకుట్టునకు నంటదు. శ్రీమంతత్వమును మంటిని శ్రీమంతులే తీయవలెను. శ్రీమంతత్వమను బలమైనమాత్రము దుర్జనేతరుల స్వాధీనమగువఱకు నెంతటి గొప్పకార్యమును జేయుటకురాదు. ఇటుల చేయవలెననియే యీ జహాగీరు నే స్వీకరించితిని. నీవు శ్రీమంతురాలవు గావలసిన యవశ్యకత లేదు. శ్రీమంతత్వము వచ్చినపిదప నాచర్యయుఁ జెడునేమోయను భీతి నీకుగలిగినరీతిగ నాకునుగలిగినది. కార్యవశుఁడయి యీ శ్రీమంతతనము స్వీకరించినాను. ఆ సంపర్కముచే నేను మదోన్మత్తుఁడను గాను. అటులయినను నానుండి దానిని వదలించుపని నీపైనుండును. అప్పుడే నీవు త్వరగారాలేదని నేనెటు కోపబడితినో యీకారణమిదియేను. ఈ పగడీయును నంగరేఖయును నీవు నీ చేతులతోనే తీయనిరొమ్ముడల నామనము తృప్తిపడదని నా నిశ్చయము. వీనినిఁ దీయుము. శ్రీమంతత్వ బంధమునుండి నన్ను ముక్తునిఁ జేయుము. (రుమాలతప్ప నితరవస్త్రములుతీసి భామిని వానిని

జెటులుగనుంచును. ) పురుషులు తెచ్చికొనిన వైభవబంధము స్త్రీలకు దీరుచుటకు కాదా? పురుషులకు వైభవమువచ్చినచో దానిని నాడువారివశపఱచి తామున్నచో క్షేమియగును జెప్పంగ రాదు. పతితులను బవిత్రులనుజేయు శక్తి కావలయు పురుషులకంటెను స్త్రీలయందు దైవము హెచ్చుగ నిడినాడు. వనమాలా! ఈ వైభవమునుండి నేనందుక పతితుఁడై యుండినయెడల నన్నుఁ బావనునిఁజేయు సామర్థ్యము నీయందు లేదా? యేమి?

భామిని:— కోపము కాదు. ఏమో విచారించితిని. మీరు నటులనే భామినిని బవిత్రురాలినిఁ జేయరాదేల?

ధైర్యధ:— అదియటుకాదు. నన్నుఁ బావనునిఁజేసి తీసికొనుపని వనదేవతదియని పూర్వముననే నిశ్చయింపఁబడినది. వనమాలా! నేను యోగ్యుఁడను. యోగ్యుల రాజమార్గమొక్కటియే నాకుఁ దెలియును. నన్నుఁ బావనకార్యములందు నియోగించుపని వనదేవతదిగ నున్నది. ఇతరుల పనికాదు. స్త్రీకుంతిను లెటునడచుకొను విషయమంతయును గ్రహించి యాడువారు పురుషలమడనును బోఁదోలవలెను. భామినినిఁ బోలువారిని బవిత్రలను జేయవలెను. ఏమి యూనుపు లెల్లఁదీసితివియా? ఈ నా మస్తకముపైనుండు చంద్రుని సైతము దింపుము. కానిచో, నేనే నా చేతులార దానిని దింపవలసినదిగా నెంతును. అయిన,.....

భామిని:— దానిని దించుపనికి నన్నేయేల నియమింపవలెను?

ధైర్యధ:— వనమాలా! ఈ నా జగము నీపైనున్నటుల నేఁ దెలిసినాను. నీ కోపులహస్తస్పర్శయగుచు తలకె నేనుచు నీచేతులిందుకు స్పృశించినచోఁ గోపమేల? ఈ పక్షపాతమేల? ముఖచంద్రశేఖరువని నీచేతులార, దానిపైఁబడవలెనని నేఁగోరితిని. ఇఁక సాలస్యమేల?

భామిని:— అయిన నాచంద్రుఁడు నాకగపడినచోఁగదా నేను దానిని దింపఁగలను? నేను బలమాఱు లాచంద్రునిఁజూడఁ బ్రయత్నించితిని. ఎటులోనరించినను నది నాకగపడదు.

గీ. భూషణంబగు చంద్రవి, భూతినాకు
గోచరముగాదు ముఖసూర్య, గోళతేజ
మెల్లదిశలను వ్యాపించి కొల్లఁగొనియె
నితరవిభవమునంత ఘహీనమహిమ.

ధైర్యధర:— గీ. రవియునేనైనఁ జంద్రకరంబులెటుల
పిచ్చివానిఁగ నను జేసి పీచమడఁచె
గగనతలమున సాధింపఁగనని పనిని
చంద్రుఁడీభువి సాధించెసాహసమున.

నీ ముఖసదనమునఁదప్ప నితరస్థళములం దాచంద్రుఁడెటు నిలువఁగలఁడు? అకారణమున నీతోనే ద్వేషించుచుందును నిజము. ఇదియునిజము, నీ చేతులతోనే చంద్రుని నామస్తకము పైనుండి తీయఁజూడుము. నిజమటులనే నేనారీతిఁ జలముఁబట్టి కూర్చుండెద.

భామిని:— ( స్వగతము ) ఆ చంద్రుని నెన్నిమాఱులు మోముఁజూచినను నామోహము హెచ్చుచున్నది. నాచేతులతోనే దానిని దూరముఁద్రోయ నేనెపుడును యత్నింపను.

ధైర్యధ:— ఏమీ! సాహసమిందుకై నను సాగనియ్యవా?

భామిని:— ( స్వగతము ) ఇప్రడేమనేయుందును? ( ప్రకాశము ) మహారాజా!

మ. శశిసూర్యప్రభలెల్లదిక్కులను శశ్వత్కాంతిలో నిండఁగా
వశమేఁగానఁగ వానికి? వనితకున్? బాటింప వేదీనికిన్?
శశిసూర్యప్రభలుండు మీపద సరోజంబుల్ హృదిన్ గాంచి నా,
కుశలత్వమ్మున సేవఁజేయుదును మీకున్; యోధవీరాగ్రణీ.

(ధైర్యధరుని ముచ్చెలుఁ దుడుచుచు నిలిచియుండును. )

ధైర్యధ:— వనమాలా! ఇదియేమిటని? ఏమే! ధర్మసాధనకసై నా పురుషార్థస్వాధీనమెల్ల నీయందు చేర్చి మే యుంచఁదలంచినాను, ప్రేమసత్వమున నాశరీరముపై నధికారమునదట మొదటనే యారంభించితివి. ఇప్రడీసేవయేమి? వలదు వనమాలా! వలదు ఇటు నా సేవఁజేయవలదు. నాకంత టిరాజ్యత లేదు.

గీ. సహజప్రేమాతిశయశక్తి సాధనమున
నన్నుఁ గెల్చితి వీవు నీమన్నవలకుఁ
బాత్రుఁడను నేను దాసుఁడై పాదసేవఁ
జేయ సెలవిమ్ము నాకు నో చెలువమిన్న.

( పరదాలో ) వనమాలా! ఏమే వనమాలా! వసంతవోత్సవమునకుఁ బిలువ నీ గ్రామజనులు మహారాజుగారి దర్శనమునకునై వచ్చినారు ఈవార్త మహారాజుగారికి విన్నవింపుము.

భామిని:— వారెవరో వచ్చినవారు నేఁ జూచెదనిమ్ము. ( వెళ్లును )

ధైర్యధ:— వసంతోత్సవ మిషఁదప్ప, నితరకార్యములనుగూర్చి యొంటరిసమయమున వచ్చియుండినను వారిముఖముఁ జూచుచుండలేను. వనమాలా! నీకేల శ్రమఁ దీనికోరు యొదవు? ఎవరువచ్చి నారో నేనే చూచెద. ( వెళ్లును. )

## తృ తీ య రం గ ము.

### ధైర్యధర శిబిరము

ధైర్యధర - విలాసధర - లక్ష్మధరులు

లక్ష్మ:— (స్వగత) సేనాపతితో, నేమాటలాడునప్రడు శుద్ధమూర్ఖునివలె నేనేమేమో మాటలాడుచు ముఖ్యమగు సంగతినిఁ దెలుప, నేమఱచితిని. విలాసధరుఁ డెంతయో వాకు నేర్పెను. అదియం తయును బోరగిల్లిన కడవపైనీరాయెను. ఇప్రదన్నియును జ్ఞప్తికివచ్చెను. భామినిపై నాకుఁ గల విరోధముఁ దీర్చికొనుటకైవానికి నేనది చెప్పక తప్పదు. “ వనమాలను బోలుబీదదాని నడవడికసైత మటులనే యుండును. కావున నీవు జాగ్రత్తగనుండుము పేదవానిబిడ్డ శీలముఁ గుశీలత వహించును. ఇది శ్రీమంతుఁడగు నాకుఁ దెలియుననిఁ” చెప్పవలసినదిగ నుండెను. ఎందుకు నావండ్లుపట్టికొని పోయెను? ఆవిలాసధరుఁ డికను వానితో నేల గుసగుసలాడు

చుండును? మంచిది. వారిరువురికిని భవనములోఁ గూర్చుండి మాటలాడుచు నిలిచినారు. వారియిచ్ఛ యటులనే నిలిచియుండవలెనని కాఁబోలు. అటులనిలుచుట నాప్రాణాంతకమేను. శ్రీమంతుల మగుమేము, దినదినము, గడియగడియయు, మెత్తలపైఁబరుండి పొర్లాడుచుండ వలెను. గాని కాళ్లనుడిచి రెండుకాళ్లను గంభములబలెఁ జేసి దానిపై శరీరము నిలువవలెనా? ఇదిబహుశ్రమ కూలిపనిచేయు వారింబలెఁ బనిఁజేయను దరిద్రులుగా వించికొనిన యుక్తి యిది. నాకిదియెంత మాత్రము మంచిదని తోఁచదు. వారింతప్రొద్దైనను నిలిచియున్నారే యదియెటులు? సృష్టికాలమున, విధాత నయనములు మూసినపుడు, దారిద్ర్యదేవత వానిశిరములో దూరకున్న జన్మమెత్తినప్పటినుండి మమ్మునెటులఁ బడిపొర్లుచుండు లాగొనరించెనో, యటులనే యెల్లకాలము సంచయుంబడి పొర్లుచుండ వలెనని నియమించి పంపుచుండెను. ఈదిక్కునుండి యాదిక్కునకుఁ బొర్లుట, కొన్నివేళల వీపుపైఁబరుండుట, హెచ్చయినచో బోరగ్రాఁకుట, కొన్నిసమయములో మోకాళ్లపైపడచుట యివియన్నియు సరియేను. ఆదిక్కున నదిక్కునకుఁ బోవు బాధ శ్రీమంతులెటు సహింతురు? ఈరీతిగ నిలువ వలెనను విషయము వచ్చినచో. సృష్టినిర్మాణ కర్తయగు దైవము శ్రీమంతుల యనుకూలాననుకూలములు యోచింపలేదని చెప్పవలసినదిగ నున్నది. ఇదిసృష్టికాలములోనే వానిధ్యానములో రాఁదగినదిగ నుండెను. నాశారీరమాంసము వెన్నముద్దవలె మెత్తగనున్నది. ఇదిమంచిదేను. అయిన నీయొమ్మిక లేలయింతకఠినములుగ నుండవలెను? లోనుండి యొంకెగఁ గుచ్చుచున్నవి! దైవమా! నాయొమ్మిక లొలిచినయరటి పండువలెఁ జేసియుండినయెడల నీపనిజరుగుచుండ లేదే? లోనుండి యీయస్థి ఖల్లెములు పైనుండెడు తోళ్లగుండ్లు నాయంగమెల్లఁ బొడుచుచున్నవి. దేవా! ఈవజ్రములు పూలవలెఁ గోమలముల నేలఁజేయకైతివి. శ్రీమంతులయంగములందంటి యుండుపలుచనినూనై రూపము బంగరునేల జేయకైతివి. ఈచిత్తరుమెత్త క్రిందిభూమి, ముచ్చెలలోన సైతమునా పాదములకు నొత్తుచున్నవి. దైవమా: ఈభూమిని రాళ్లతోను మట్టితోను, చేయుమని నీకుఁజెప్పిన వారెవరు? తారామండల నిర్మాణకారణమున దైవముసైతము సర్వశ్రీమంతుల ధనవ్రయమొనరించి పిదపనీపృథ్వీ నిర్మాణకార్యమపుడు నిజముగ భికారియైయుండెనని తోఁచెడు. దరిద్రదేవుఁడుతప్ప భారముగల రాళ్లను మఱలమట్టియు భూదేవి యురముపై మోపువాఁడెవఁడు? అంతటిశ్రమ కెవరోర్తురు? దేవా! నముఁబోలెడినొక శ్రీమంతుని, నించుకనీవావేళ నీగురువుగఁ జేసికొనియుండినచో, రెండు రెండు, నాలుగు నాళ్లు, మూరలపొడుపుఁ గలిగినట్టియు చక్కఁగనేసి మెత్తఁబడిన పట్టుతోనైనను, దూదితోనైనను నీపృథ్విని నిర్మించియుందులాగు బోధించుచుంటిని, శ్రీమంతులకు బాగుగనుండెను. ఇదినీకుఁదోఁపకున్న నేర్చికొనఁగూడదయి యుండెనా? దేవునిసర్వాపరాధములు నిపుడిపుడు మేమిందు కించుక మాయిండ్లలోఁ జిక్కఁబెట్టుచున్నాము. ఈదై[illegible]ధరుని దర్శనమునకు వచ్చినపుడు దరిద్రునిబలెనే నడచుకొన వలసినదిగ నున్నది. ఇచటఁబడి పొర్లుచుండెద. శ్రీమంతుల నడవడికలెటు లుండునోయనునది యిపుడైనవాఁడు నేర్చికొననిమ్ము. ( కూర్చుని కాళ్లువెడల్పుగఁ జాచికొనును ) ఇప్పుడుకొంచము మేలాయెను. ఎంతప్రొ

దైనను వారటులసేనిలిచి యుండని. అటులనేమాటలాడుచు నెంతకాలమైనను నిలిచి యుండని.

(విలాసధరధైర్యధరులు వత్తురు)

ఇంకను నెంతకాలము నిలిచిమాటలాడవలదని యెవరుపలికిరి? కొంచెము పొర్లినాను. అపుడేవచ్చిరి. ఇచటసేవకులు సైతములేరు. ఎవరు కేలూత యిచ్చినిలువఁ జేయుదురు. [లేవసాగును.]

విలాస:— ఏమండీ! పొర్లెదరు? [చేయియిచ్చి లేవును]

లక్ష్మీధర:— ఏమివలదు. మొదట సేనాధిపతిగారికి విన్నవించికొను సంగతి మఱచితిని. అదిజ్ఞప్తికివచ్చెను. మఱలనది పోనటుల చేతులుకాళ్లుఁబట్టికొని యిటునిలిచినాను.

విలాస:— ఇదినిజము. నీవువిన్నవము విషయము మఱచినావుకదా! వీరిదిరెటులో జ్ఞప్తియున్నది.

ధైర్యధర:— బాగున్నది. మఱచిన దేమారెను?

లక్ష్మీధర:— మీరిచటసకుటుంబ సపరివారముగనున్నవారని వాఱులు పలికిరి. కావున వదినెగారిని, మా గ్రామసమీపమున వసంతోత్సవ దర్శనమునకుఁబిలువ నేరీతి రావలయునోకదా? నాకు లగ్నము కాలేదు. సేనాపతి గారిచటనే నిలుదునెడల విలాసధరుగారిని నడిగికొని వారి రాణిగారినిఁబిలువఁబంపెదను.

ధైర్యధర:— అటులేమియువలదు.

లక్ష్మీధర:— మా గ్రామమునకుఁ జేరు రెండుదినములకుమున్న సేనాధిపతిగారిని మఱలదర్శింతును. అపుడు తాముచెప్పినరీతిగ వదినెగారినాహ్వానించు వ్యవస్థచేయుదు.

ధైర్యధర:— వ్యవస్థయేమియును చేయవలదు. అటులేమియును లేదు. మావలెనె నాకును లగ్నము కాలేదు.

విలాస:— అనఁగా.

లక్ష్మీ:— అనఁగా. అయిన వారెవరు?

విలాస:— అయినవారెవరు?

లక్ష్మీ:— ఆయినవారెవరు? నాతోనందఱుఁ జెప్పిరికదా.

ధైర్యధర:— [స్వగత] ఏమిచేయుదును? లోకులకీజోలియేల? ఎవరుచెప్పిరి?

విలాస:— అయినవారెవరు?

ధైర్య:— ఎవరు? మఱలనేమి? మీరేమినేయుదురు? విలాసధరుగారూ ఆమాటల నిజముకొంత కాలములోనేయగును. పిదపమీకు సర్వమును దెలిపెదను.

లక్ష్మీ:— తెలుపఁదగినదేమియునులేదు. తెలిసెను. నాకుఁదెలిసెను. సేనాపతిగారూ! ఆసమయమున నేనునిజముగ నానందించెదను. మహారాజుగారికువద్దైదులక్షల జహగీరునిచ్చితమ్ము శ్రీమంతులవర్గములోఁజేర్చిన వెంటనె, యాగర్వశ్రీమంతులకు సైతము మార్గదర్శకులుగ నగుటకు మీరర్హులు. ఈసూత్కాంశముతోనే తామగవచుటకుఁ బ్రారంభించితిరి. నాకు నిజముగ నానందమగుచున్నది. తమఁబోలు శుద్ధకార్యధురంధరులు మాకు మార్గదర్శకులుగనుంట శ్రీమంతులెల్లరుఁ గోరఁదగినదియ. తమదేహము శ్రీమంతులనిజమగు లక్షణమును జూపట్టుచున్నది. ఇదినాకుఁబూర్వమే తెలిసియుండెను. ఎప్పుడు?విలాసధరగారూ! జ్ఞప్తికివచ్చెనా?

విలాస:— ఆ దినమునఁగదా? ఆరాత్రిగదా? ఆదొంగలు గంటువడినరాత్రి?

లక్ష్మీ:— నిజము. అదియేను. ఆరాత్రియేను, మేమును మంత్రిసేనాపతి గారును వనమాలి యింటి ద్వారమునఁ దప్పక యొకరి నొకరు చూచితిమికదా? అదియనాకిపుడు ధ్యానములోఁ వచ్చెను. శ్రీమంతులలక్షణము సేనాపతిగారికిం బూర్తిగలభించెను. తమకదిగంటువడినదని నాకాదినమున భోత్తిగఁదెలియకపోయె.

విలాస:— కాదు సేనాధిపతిగారికి దానివలంది తెవుగేమియునుగాదు.

లక్ష్మీ:— ఇది యందఱిలోను నడచుననేను. లగ్నము చింతలోఁబడక యిట్టి సంబంధము మీకుఁ గలుగుటయు సంతోషముమాట. నాకులగ్నముకాలేదు. మీరామోదించినచో నేనే మీయింటికో కాదు నాయింటివారిని నెవరికైన నిచటికిఁ బిలువనంపెద.

ధైర్యధ:— అట్టి యవశ్యకత యేమియును లేదు.

విలాస:— తమయెదుటనే యాహ్వానము సేయుటచే నామె కోపగించును. ఇంటిపెండ్లాముకంటెను నిట్టి సంబంధముగల విషయములో మానాపమానప్రశ్నలు నిండా కఠినములుగనుండును.

లక్ష్మీధ:— ఇట్టి సంబంధవిషయములలో, చిక్కులన్నియును నాకెంతగనో తెలుసును. నేను ప్రగల్భములు మీతోఁబలుకుటకాదు. తెలిసికొనుజ్ఞానము నాకుఁ బుట్టుకతోడనే వచ్చినది. నేను స్వంతముగఁ బిలుతునా యేమి? నన్ను గుర్తిందునని తోఁచును.

ధైర్యధ:— ఈ యధిక ప్రసంగమేమియును వలదు. బహుశః నేను మీగ్రామమున నిలువను. మీరు శ్రమ తీసికొనవలదు.

లక్ష్మీధ:— కోపమువచ్చెనుగాఁబోలు. నేనే పిలువవలెనను హఠము నాకులేదు. తమయెదుటనే యామె నాహ్వానింతును. మీరు నాగ్రామమునకు వచ్చియ తీరవలెను.

ధైర్యధ:— వలదు. ఈ ప్రసంగమువలదు. విలాసధరగారూ! నేను మీ గ్రామమునకు వచ్చెదను. వీరిగ్రామమునకు వచ్చునట్టులేదు. లక్ష్మీధరగారూ! నాకు స్పష్టముగఁ దెలుపుఁడి. మీరు వనమాలినిని గురించి యేమిఁజలికితిరి?

విలాస:— ఏమండీ! వారివాక్యములో నర్థమేమున్నది? ఎందఱు వనమాలినులపేర్లు వీరుంచిన పుస్తకములోఁ జేరినవియో గుర్తింప నెటులగును?

లక్ష్మీధ:— ఏమండీ! శ్రీమంతుల దర్శనమైనతోడనే, బీదవారిబిడ్డ లడ్డపేడెములు ద్రొక్కుదురు. ఆవిషయమింతదూరము విచారింపనేల? మీకు స్పష్టముగఁ జెప్పునదేమియనఁగా, నేను గుర్తించు విషయములుగూడఁ గొన్నివేళలఁ దప్పుచున్నవి. నాతండ్రిగారు నాకొకపాఠము నేర్పినారు. నూటారొనిమిది ధర్మశాలలుతిరుగు వ్యభిచారులకు, పృథ్వీ ప్రదక్షిణఫలము లభించునఁట. నాతండ్రిగారట్టి పుణ్యమార్జించిరి. నేనును శ్రీమంతుఁడుగనున్నాను. అయినను నధికార గొప్పతనము నాకిఁకను జిక్కనికారణంబున నాతండ్రిగారికి వచ్చినంతకీర్తి నాకురాలేదు. అయిన మీరించుక నాకుఁదోడ్పడితిరేని నా తండ్రిపేరుకంటెను రెండింతలు మూఁడింతలు నాపేరు హెచ్చింపక యుండువాఁడనుగాను.

ధైర్యధ:—మీకులకర్మచర్యలు నాకు వినిపింపవలదు. విలాసధరుగారూ! వీరిని నిచటినుండి పిలిచికొని పొండి. కానిచో నేను మీగ్రామమునకు సైతమురాను.

విలాస:—వెళ్లుఁడి. సేనాపతిగారి ప్రకృతి యిప్పుడు బాగుగలేదు. వారినిటు చింతలోనిలుపుట యోగ్యముకాదు. మనముపోవుదము. ( వెళ్లనారంభించి లక్ష్మీధరునితో ) నేఁడుమీరు నిజముగ శ్రీమంతత్వమును జూపితిరి. ఈగుండు తప్పకదవిలెను. అతఁడు మీ గ్రామమునకు రాఁడు. అతఁడు భామినిని నిరాకరించినయెడల యది వెంటనే తనపాదములతో నడచుచు మీవద్దకువచ్చును. ( వెళ్లుదురు )

ధైర్యధ:—( స్వగతము ) ఏమి వీనిశ్రీమంతత్వము? ఏమి యీ శ్రీమంతుని వ్యర్థభాష. శ్రీమంతవృక్షమున నీరీతిఁ గుళ్లిన విషఫలము పుట్టుచు నుండినచో, శ్రీమంతవృక్షపు నీడలోనిలుదునటుల దైవమా, నన్నేలచేసితివి? దారిద్ర్యమను, దహించుతపనుని జ్వాలలో నిలిచినమాత్రన నాకేమితక్కువ సుఖములభించుచుండెనా? వనమాలినీబోలు నిర్మలనిష్ఠావ సతేజ మానసము నందతః పతన కారణ కార్యముండునా? ఉండదు. అట్టిపాపసాంబంధికా శుచి దానికినంటునా అంటదు. దానివిషయమున సంశయనుగలుగుట నామూర్ఖ్యమేను. ఆ దుర్మార్గునిపై నాగ్రహించుటయందర్థములేదు. నేను దైవముపైఁ గినుకవహింపవలెను. పాపప్రతాప ప్రౌఢిమను బ్రకటించు చాండాలురకు దైవమా! లక్ష్మీదేహస్పర్శ రయేలకలిగించితివి? ఈ భూరిపాతకి శ్రీమంతునిసెల మనిచితివి? ఇట్టి తుచ్ఛ నరపశువునకు లక్ష్మిని జూపుచు దైవమా, యీ దేవిస్నేహము వారుసేయుట నీవెటు సహించెదవు? మొదటినరకము వారికిఁజాలదని వారిని శిక్షించుటకునై, నవీననరకము కల్పింపఁజేయుము. ఇట్టి పందెమాడినపిదప దైవమా! ముందేమిసేయఁదగినది నీకు తెలిసియున్నదియూ? యేమి? ఉండును. తెలిసియుండును. ఊటక మముఁబోలు పేదలదిక్కునంద లక్ష్మీనాథునై యేలవచ్చునో? ఆ పాపరాశినుండి నన్నువిడిపింప సామర్థ్యము నాభార్యకు లేదు. కావున సత్వశీలయగు నీబిడ్డయయినను మాతృగమన పాతకమొనరింపఁజూడు పాతకులచేతినుండి వారితల్లిని విడిపింపవలెను. అట్టి యాక్రోశమీ మూఁడుపదకముల లక్ష్మి నావీనులలో బోధింపసాగినది. రాజధానికిఁబోయి పృథ్వీధర మహారాజుగారికి విజ్ఞప్తిచేసికొని ప్రథమమున నప్పనియచేసెద.

చ. విలయబలాతిరేకమున, బీడ్వడినట్టిధరిత్రినిఁ, గృషీ
వలుఁడెటు నట్టుత్రవ్వి కడువావిరిఅప్పలఱాల్లనేరి, స
త్ఫలముసునందునో యటుల భాగ్యమదాంధుల గర్వమార్చి
యీ యిలనుఁబవిత్రఁజేయ, ధరణీశుని వేఁడెద నట్లొనర్చెదఁ.



# మానాపమాన నాటకము.

పంచమాంకము - ప్రథమరంగము.

శంకర మందిరము.

భామిని - ధైర్యధరు - కుసుమ - వినోద - నటులు.

భామిని:— ( స్వగతము )

చ. ఖలులకుదోషముల్ సుజనకాండమునందతిపుణ్యముల్ ధరా
తలమునసుండు; దోషమనద్రవ్యసమేతము; పుణ్యమన్ననో
దళితధనమ్ము దుఃఖసముదాయగృహమ్మను, నైనస్వర్గసం
కళనపథమ్ము శాశ్వతసుఖమ్మిడు నౌషధమా పరమ్మనన్.

లక్ష్మీధరునియందు మూర్ఖతనమునకుఁ జేరికగ దుష్టతనము నిండియున్నదని నేఁ దెలియనైతిని. స్వప్నమందైనను నేఁ గననైతిని. కృపాణధారను గొంతుపై మూర్ఖతనమునయుంచిన నేమి దుష్టతనమునయుంచిననేమి? కృపాణధారచే గొంతు తెగుట నిజముకదా? ఆ దినమున ధైర్యధరుగారి శవమును నధికారులవర్గములోనుండి తీసివేయవలెనని యుండిరి. నేనడ్డపడితిని. సర్పమునకుఁ బాలుఁద్రాపినచో నది యుపకారమేరీతిఁ దీర్చునో యదేరీతిగ నా శవము నాయుపకారముఁ దీర్చికొనెను. వానిని నధికారమునుండి తొలఁగింపవలెనని పునః నాకు నిచ్ఛగలిగినది. అపుడే నెన్నటెన్నటికి వానిపై దయనుంపుమని వేఁడను.

( ధైర్యధరుఁడు వచ్చును )

ధైర్యధ:—వనమాలా! వెలుపటఁ దోఁటలో వసంతోత్సవ సంబంధమైన యుత్సవ సమారంభము హెచ్చుగ నడచుచుండును. గానము, నృత్యము చూచుటవదలి చింతిల్లుచున్నావేల? మఱల నీమోమేల వాడువాఱుచున్నది. మోము చిన్నదయినవేల? ఏకాంతమున నేల గూర్చుంటివి? ఆ లక్ష్మీధరుఁడు నాతోనాడినమాటలు నేనూఱక నీకుఁ దెలుపవలెనని చెప్పినందులకు దాని నేనీవు పలవరించుచుఁ గూర్చుంటివి. దీనముద్రనువహించి కంట నీరుగార్చుటయేల? ఇట్టి నిర్మలలోచనంబులయందును, నిష్పాపకాయమందునను, నిట్టి కోమలమానసమందునను, నెవనికి నెప్పుడైనను గాని సంశయమువచ్చునా?

భామిని:—అయిన మీకు వచ్చియుండెనుగదా!

ధైర్యధ:—నాకు సంశయము వచ్చియుండెనా? నీకన్నిమాటలుఁ దెలుపవలెనని నీతోనంటిని. ఇంతయు ఒకవేళ నటు సంశయమువచ్చినను నీయొక్క యశ్రుబిందువు వేయిసంశయములనైనఁ బోఁ జేయదా? కాదు. ఆ సంబంధమున నీకిఁకఁ నొకయక్షరమునైనఁ బలుకను. « నీతండ్రి నేఁడువచ్చును. అపుడీవిషయమున మీకు నిజముతెలియునని చెప్పియుంటివికదా? అదియు నాకగత్యములేదు. ఎవరేమనినను నీవీక్షణమున నే నాధర్మపత్నివగుదు. శ్రీమంతుఁడుగాని పేదవాఁడుగాని మఱియెవఁడుగాని మాటలుచేతనైనను, శక్తిచేతనైనను, నాచేతఁజిక్కిన

నీచేతిని దూరముఁజేయ శక్తుఁడుకాఁడు. ఇదినీవు దృఢముగ నమ్ముము...............

భామిని:— అయిన గర్వభగ్నప యోగ సమయమువఱకుఁ దమకేలు నాకేలంటక దూరముగనుండవలెను.

ధైర్యధ:— రణాంగణమున శత్రువులపైఁబడి నపుడెప్పుడును నా చేతులు దూరగిల లేదుగా.

భామిని:— అప్పుడు మీ యర్ధాంగికేలు మీకేలనుండ లేదు. కాయమునఁనుండ లేదు. వచనమున మనమునఁగాని యుండ లేదు. అట్టికూడిక యెటుల.........( వినోద కుసుమవత్తురు ) అన్నన్నా! నాయన్న వచ్చెనేమో? బాగాయెను. సమయమునకువచ్చెను. అతఁడువచ్చెనేని లక్ష్మీధరుని సంబంధవార్త......వలదు నేనేయతని చెవులో వేసెద.

ధైర్యధర:— అటులఁజేయు కార్యమేమున్నది? నామనమునందించుకయైన సంశయముండినఁగదా?

భామిని:— ఎందుకునుగాదు. సకలమగు మాటలు నతనికిని మీకును దెలియుట మంచిదికాదా? ఏమి? ఇదియేమి? నాయన్న వీరివెంటరాఁడాయె నేల? ఏమే పుష్పమాలా! నాయన్న యిచటికి వచ్చినాఁడు కాదా?

వినోద:— బాబాసాబుగారు వచ్చినారు. అటులనే భామినీ......అటుకాదు. ఏమే పుష్పమాలా! వీరి నాయన్నగారు వచ్చినారా యితరుల తండ్రిగారెవరయినను వచ్చినారా చెప్పఁగూడదా?

కుసుమ:— వనమాలా! యూ నాయన్న వచ్చినాఁడు.

భామిని:— మంచిదాయెను. శైవము నాచింత దూరగించెను.

ధైర్యధ:— వారేమియును చెప్పియుండరికదా?

కుసుమ:— వారొకరే రాలేదు. భామిని నాయన్నగారి వెంట వారువచ్చియుందురు. ఈ వసంతోత్సవ సమయమునఁ దమదర్శనమును జేయవలెనని వారు దలఁచినారు.

భామిని:— నేనెంతటి యవసరమున వారినిఁ బిలిపించిన విషయము లెల్లఁ దెలిపితివియా పుష్పమాలా?

కుసుమ:— అవును. నేనంతయును దెలిపితిని. విలాసధరుఁడును, లక్ష్మీధరుఁడును యిచటికి నేల యెటు వచ్చియుండిరనునదియు మహారాజాగారికిని వారికిని నేమేమి మాటలు జరిగినదియు మహారాజాగారి ప్రేమాలయమున సంశయ విషమెటుగలుప వారు ప్రయత్నించినదియు నంతయును దెలిపితిని. అప్పుడు భామిని తండ్రిగారనిరికదా! నేనే ధైర్యధరుగారి సరసకువచ్చి మిమ్మనిత మఱియు మీభార్య యేర్పఱచి తీసిన యీ వనమాల గంగోదకమురీతిఁ బవిత్రురాలని పలికెను. ఈ రీతిగఁబలికి వారును బ్రయాణమైరి.

వినోద:— భామినినైతము వారివెంటనె ప్రయాణమయ్యెను. సేనాపతితో నేను వివాహమాడకున్న లేదు గాని, నాదాసిగా నుండఁబోవుదాని, నాతఁడు పెండ్లియాడును. అంతమట్టుకు నాకానంద మాయెను. ఇటు భామినియునైను.

కుసుమ:— భామిని. భామినితండ్రి వనమాలతండ్రి మీమామ సర్వలు నేఁడువచ్చుచున్నారనియును దమ దర్శనమునకు వచ్చుచున్నారనియును దెలుపవచ్చితిని. నేను వారినిఁ బిలిచికొని రాఁజూచితిని. అప్పుడు భామిని సకలాభరణములు ధరించికొని శృంగారమగుటకుఁ బ్రారంభించెను.

ధైర్యధ:— తన వైభవగర్వమును నీకుఁ జూపుటకునై భామిని యిచ్చకాఁబోలు. రానిమ్ము. తన సకలాభరణములు ధరించికొని రానిమ్ము. ఈ సౌందర్యమును జూచినచో సకలము వజ్రములు ముత్యములు వాడిపోవును. మఱలఁ దానికి దాసిగానగుటకునైతము తనకు యోగ్యత లేదని

తానే తెలిసికొననిమ్ము. ఆభరణములు ధరించి యదిరానిమ్ము. ఆభరణములు నైజరూపములు గావని శ్రీమంతు లగత్యము తెలియవలెను.

వినోద:— బాబాసాహెబుగారు మీరనినరీతిగ చేయనిరి. వనమాలినని భామిని తొలగించేయఁ గారణము లేదని హెచ్చరించెను. అప్పుడు భామిని కోపగించి పలికెనుగదా..................

భామిని:— వినోదా! ఏమికుచేష్టలు చేసెదవు? ఆ శ్రీమంతుని ముగ్ధకన్య కోపభీతియేయుండునది నిచట నింతగఁ బలుకుచున్నావు?

ధైర్యధ:— దానినుండి భీతియేమి? ఈ లగ్నమునపిలో శ్రీమంతులను బొత్తిగ నవమానమునునని కోపమున నేమో పిచ్చిదానిగ నటించినది. వినోదా యేమనెదవు?

వినోద:— భామిని కోపమున నగలన్నియును దీసి పారవైచెను. కంఠములోనిహారము తుంటతుంటలొనర్చెను. కాలిపంజెలు తీసివేసెను.

కుసుమ:— నేను భూషణరహితయైవచ్చెదను. నీవిటి కొనిపోయి వనమాలీదేహ మలంకరింపుము. అప్పుడెవరు సౌందర్యవతులో చూడనగు.

వినోద:— అప్పుడు బాబాసాహెబు చెప్పెనుగదా. కార్యము నేగాక తీర్మానించి యెటు గర్వమునఁ ద్రుణీకరించుచున్న నేను హారమున ధైర్యధరుని గొంతుకఁ గట్టవలెనని యుంటిని, ఈ యపరాధమునకు బదులుగ నా ప్రేమయును నీ సొమ్ములును నేను వనమాలికి యర్పించితినని ధైర్యధరు గారికిఁ దెలుపుమనిరి.

కుసుమ:— ఆ కార్యకారణమున బాబాసాహెబుగారు రాక పూర్వమే వనమాలినికి సొమ్ములు వేయుటకునై నేను మొదటనే వచ్చితిని. భామిని నాగహించి యీ సొమ్ములు వనమాలి ధరింపవలెనని బాబాసాహెబుగారు పలికినారు.

భామిని:— నాకు సవతికావలెనని చూచుచుండెనుగదా యది? భామిని సొమ్ములు నేను ధరింపకున్న నాకేసదపదా? నా ముచ్చటలకేమి యుక్తియా?

ధైర్యధ:— శ్రీమంతులరీతిగ సౌందర్యగర్వము భామినికిఁ నున్నదేమో? చూడనిమ్ము. ఈరూపము ముందు తనరూపమెంతయో? ఏయర్థమున దానికీ సౌందర్యగర్వమింతగఁ గలిగినదియో యీయర్థమున నే వీరిరువురి సౌందర్యమును జూచినచో వనమాలీభారము హెచ్చి తక్కెడ తలక్రిందు లగునేమో? దానిని నీవు చూచినావుకదా? రూపమునందు దీనికిఁ దులదూగునా యేమి?

భామిని:— దానిరూపమును గట్టికొని తామేమిసేయుదురు?

ధైర్యధ:— నాకు నీరూపముఁదప్ప నితరవనితల రూపమెద్దియునుఁ జూచి చేయవలసిన దేమియును లేదు. అయిన నేను హితులనుండి వినినమాటల నిజస్థితిఁ జూచి నిర్ధరింపవలెను. ఏమితా వినోదా! భామినీరూపమెటులున్నది. ఎందున్నది?

వినోద:— దాని దేహమునుండి యలంకారము తీసినయెడల నదియే నిజముగ వనమాలియననగును. దేహము నలంకరించికొనిన భామినియేను. మహారాజా! ఈ సొమ్ములచే వనమాలి నలంకరింపఁ జేయకుము. ఎందుకనఁగా:- భూషణములు లేని భామినిని, వనమాలయని మీరు తెలిసికొని యీ వనమాలినివదలి యీ వనమాలిని వివాహమాడుదురేమో.

ధైర్యధ:— నీవింతగ వర్ణనఁ జేయుచున్నావు. నల్లురాసువారిరీతిగ సూచనగును. ముక్క ముక్కరీతిగ

ను, కనుఁగవ కనుఁగవబలెను, వీనులు వీనులభంగిని నుండును. పరమేశ్వరుఁడు నయనములు చేయును. వానిని వజ్రములబలె వెలయఁజేయును. ఇది చమత్కారము.

భామిని:—నాబలె భామినులయొక్క యంగాంగములెటులున్నవి?

ధైర్యధ:—ఎటులైన నుండినను నుండనిమ్ము. భామినిని నెదుటఁజూచినచో నేను వృథముగఁ బలికెదను.

భామిని:—అవియెటుల?

ధైర్యధ:—శ్రీమంతులకునొక గొప్పచింతతగలిగియుండును. అదినీకుఁదెలియదు. కావున నీవిది విచారించెదవు. శ్రీమంతులు తమనిషయమిటు తలఁచియుందురు. లోకులు తమయందమును శ్లాఘించుచున్నారు కావున నదేరీతిగఁ దామందముఁ గలవారమని నిశ్చయించికొనియెదరు. లోకులకు శ్రీమంతులద్రవ్యముపైదముగనుండును. అనయువముల నటుతెలంపరు. శ్రీమంతులది తెలియఁజాలరు. నేననేక శ్రీమంతులను జూచితిని, వారికించుక దారిద్ర్య వేషమునువేసి దారినూడ్వ నియమించినచో నట్టిచోఁకి మోములు పదేపదేయగపడి జనులకు వమనరోగము కలుగునని యుండఱు వలదబోప్రయుని వానివిడిపింతురు. అట్టి వికారస్వరూపముగల వారైనను వారు తమసౌందర్యమును లోకులుమెచ్చుచున్నారని తెలియుదురు. ఇది నా నిశ్చయము. భామినివిషయముకూడ నటులనేయుండును.

భామిని:—ఉండదని యెవరుచెప్పిరి?

ధైర్యధ:—దానిని బొత్తిగ నవమానింపనే సొమ్ములు.

భామిని:— భామినిసొమ్ములే నెన్నటికిని ధరింపను?

ధైర్యధ:—మనమించుక రాజధానిలోనుండినచో నట్టిసొమ్ములరాశి నీ ముంగిటఁ జేప్పుచుంటిని. భామినియును బాబాసాబుగారును నిచటికి వచ్చిచేరకమున్నే వారికంటెను మిఱుమిట్లుగొనులాగు నీవలంకరింపఁబడవలెను. కావున బాబాసాబుగారిచటికి రాకమున్న వారిచేసంపఁబడిన సొమ్ములు నేనే నాచేతులార నీదేహముపై నలంకరించెదను. అంతయేను.

భామిని:—ఆభామిని నాసవతియగు కారణంబున నదియిచటికి వచ్చుచున్నదని నేఁ జెప్పలేదా? సవతిసొమ్ములు ధరించి మైలపడుటనే నిచ్ఛయింపను.

( శీలధరుఁడువచ్చును. )

ధైర్యధ:—మంచిది. శీలధరా! ఇదిఱేమి నీవిప్పుడువచ్చితివి? నెలవు ముగియకమున్నే నీవేలవచ్చితివి?

శీలధరః— మహారాజుగారూ! నెలవుదినములలోనే నేను రాజధానికిఁబోయియుండఁ, బృథ్వీధరమహారాజుగారి దర్శనమాయెను. యుద్ధవిషయమును సేనలవిషయమున, సేనాధిపతివిషయమును మాటలాడుచుండఁగా మహారాజుగారు నన్నొకప్రశ్న యడిగిరి.

ధైర్యధ:—ఏమనివిచారించిరి?

శీలధర:— సేనాపతిగారు రాజధానికి వచ్చునపుడు తమభావి భార్యతో సైతము వచ్చెదరనివింటిని. ఇది నిజమేనా? మహారాజుగారిట్టి ప్రశ్న యడుగుటముచే నాశ్చర్యమేమియును లేదు. పిల్లలకును పెద్దలకును సర్వులకును మాటలాడు విషయమిదియైనది. వనమాలగారెవరు? ఎచ్చటివారు? ఏమిపనిజేయువారు? అను ప్రశ్నలకు బదులిడి యుండి నేను వేసరితిని. వనమాలగారెవరయి

నదియు నెచటనుండునదియుఁ బ్రథమదర్శన మెటులైనదియు నచట నేమేమి జరిగినదియు మహారాజుగారికి నేఁ దెలిపితిని. తనువివాహ నిశ్చితార్థము చేసియుండకమున్నే లోక వార్తలు మహారాజుగారి చెవిలోఁ దూరినవి.

శైర్యథ:—నా లగ్ననిశ్చయము కాకమునుపే లోకులీ విషయమెటు లెఱింగిరి?

వినోద:— ఏదుగురినోట నీశ్వరుఁడుండును. ఆదైవమే నావలెనే సర్వమును మున్మున్నగఁ దెలియఁ జేయును.

శీలధర:— ఈ లగ్నము నిశ్చయింపఁబడినదని విని మహారాజుగారానందపడిరి. మఱల నాతో సందేశము పంపినారు. ఏమన:—లగ్నసమారంభము రాజధానిలోఁ గావలయుననియు వనమాల గారు రాజకన్యగాఁ దలంచి రాజయోగ్యమగు నలంకారములచే భూషించి కన్యాపక్షమున మహారాజుగారే యుందురనియు నేవేళలో "రాజకన్య" యను శబ్దము వెడలెనో యా సమయమునుండి రాజకన్యావర్గములో వనమాలినిగారు చేర్పఁబడిరనియు వారాన తెచ్చిరి. ఆ వైభవమునకుఁ జేసినవియే యీ యనుపులు నీ యలంకారములు. తల్లిగారికి సమర్పింపుమని మహారాజుగారు నన్నుఁ బ్రారంభముననే పంపిరి.

( వస్త్రములు సొమ్ములు నిచ్చును. )

శైర్యథ:—వనమాలీ! బాగయ్యెను. ప్రారంభమున శంకరుని సముఖమునుగ నా దైవమును సాక్షిగనుంచికొని లగ్నము చేసికొనవలెనని శపథముఁ జేసితిని. కాదేని పేదవానిబిడ్డతో వివాహము చేసి కొనుటకు బదులు రాజకన్య నా కొంటుకుఁబడెనుగదా? ఇతరభామినులకంటెను రాజకన్యమే లేదు. నీకాభామిని నగలువలదుకదా? మహారాజుగారు పంపిన యీ సొమ్ములను ధరింపుము. భామినివచ్చినపుడు దానిసౌందర్యము నిస్తేజమొనరింపుము. శీలధరగారూ! దీని తండ్రిగారు నన్నుఁ జూడవలెనని వత్తురఁట. వసంతోత్సవమునకు మున్ను వారువచ్చినచో వారినిచటికిఁ బిలిచికొనిరమ్ము. రాజకన్యాలంకారమైన శృంగారముగు దానికంటె నధికముగ దానితండ్రినిఁ జూచి వనమాలి సంతసించును.

శీలధర:— మహారాజా పోయివత్తును. ( వెళ్లును )

శైర్యథ:—వనమాలీ! నీచెలిచే నీయలంకారములను వేయించికొనుము. ( పరదాలో మేళతాళముల ధ్వని )

అదె వినుము. నృత్యగానములగుచున్నవి. వసంతోత్సవమునకు మేళమగుచున్నది. ఈదిక్కునకే వచ్చుచున్నది. పొమ్ము. పుష్పమాలా! వెడలుము. ఒక్కొక్క సొమ్మును దేహమునందు వేయ, నీచెలికిఁ దోడ్పడుము పొమ్ము.

భామిని:—నా నాయన్న యింకను రాఁడాయెను. మహారాజుగారు పంపినసొమ్ములను ధరించునపేక్ష కంటెను, నాయన్నను జూచునపేక్ష నాకు హెచ్చుగనున్నది. అది ప్రేమసేవ. స్వకష్టమున సంపాదింపఁబడిన యీ సొమ్ములనుఁ జూచి సకలస్త్రీలు నన్ను ధన్యయని పిలుతురుకదా?

శైర్యధ:— అముఖ్యమైన యలంకారముల చుట్టును విచ్చటిచిల్లర భూషణముల ప్రభావళి యుంచినచో సోపానముపైన సోపానము సౌధమువలెకనుబోయి చేరినచోనను బోలుపేద వారందఱు నుఁజూచి సంతసింతురు. ఇదెగనుము. బాబాసాహుగారు వచ్చువంతలో సర్వాలంకారములు ధరించిరమ్మా. రాజకన్యయయిన వనమాలి యొక్క దివ్యసము అందఱికంటెను ముందు నాకుఁ గావలెను. ( వనమాల - పుష్పమాల - వెళ్లుదురు ) - వినోదా: కొంచెమునేపు వసంతోత్సవమును గందుమురమ్మా.

పాట:--- ( పిల్లలుపాటలఁ బాడుచునటించు చుందురు )

వినోద:--- మహారాజా! ఈపిల్లలు పూలతో శంకరుని సమాధిచేసి కప్పిరి. మనము మైమఱచితిమి. ఈపిల్లలీ రుద్రాలయమును బుషమండలమునుండి ప్రేమకుందిరగునసకు దించిరి. బాబాసాహుగారు వచ్చినపిదప వనమాలి పాణిగ్రహణము శామిచటఁ జేసినచో వసంతోత్సవ మహాప్రేమమందిరములో నయినదొనలఁ గలశమెక్కించిన రీతిగనగును. శీలధరుఁడేమి చేసినను బాబాసాహువారికి దొరకునని నాకుఁదోఁచదు. తమ యాజ్ఞయయినచో, నేనుఁజక్కఁగ వెదకివారినిఁ బిలిచికొని వచ్చెద.

శైర్యధ:—ఏమోగొప్పకొనిసైవమున, వాపిల్లలు నృత్యమాడుటఁజూడ వారివెంటఁబోవలెనని నీ యపేక్షకాఁబోలు. పొమ్ము. వినోదా! పొమ్ము. ఈరీతిగజరుగు వసంతోత్సవసమయములో నీ యపేక్షకు భంగమేల కలుగవలెను? పొమ్ము. అనుభవింపుము.

వినోద:— మహారాజా! పని మాటలవ్రాఁత; సుఖానుభవము తమభాగ్యము. అదిగో యాకారమునఁ గొని యుత్సవమే, తమదిక్కుకు వచ్చుచున్నది ( వెళ్లును. భామిని పుష్పమాల వచ్చుచుందురు )

పుష్ప:— ఇదియేమే? వేయఁదగిన సొమ్ములిఁకను నిలిచినవి. ఇంత, యవసరమా? ఆ పూలచెండు తురుములోఁ జక్కఁగఁ గూర్చుండ లేదు. ఏమేకొంచెము సావకాశమునుగ నడవఁగూడదా? నీయవసరములోఁ గొప్పున దురిమిన పూలచెండు జారి మహారాజుగారి దేహముపైఁ బడును సుమా! ఏమిచేయుదును దీనిని?

శైర్యధ:—పుష్పమాలా! దేవదర్శనమునకిపుడు నటించుచుఁబోయినదెవరు? ( భామిని దేవాలయము దిక్కునఁబోవును. )

పుష్ప:— ఎవరనఁగా? సకలము నాశ్చర్యమేను! మొదట దేవదర్శనముఁజేసి పిదప మహారాజుగారి దర్శనమునకుఁ బోయెదనని యదిపలికి మహారాజుగారియెదుటనే కావలసిపోయినది. ( భామినిఁజూచి ) నిలువవే. సకలాభరణములు వేయకమున్న నిన్ను నేను దేవునియెదుటఁ బోనియ్యను. ( వెళ్లును )

శైర్యధ:—ఇపుడు నటించుచుఁ బోయినదెవతెయుండును? వనమాలియేను. మఱియెవరుందురు? వజ్రములు, ముత్యములనఁగా, సౌందర్యముదమేను. ఇన్నిసొమ్ములచే శృంగారింపఁబడిన పిదప జానిపాదములు నటించులాగుననుండుట యాశ్చర్యమేమియునుగాదు. అయిననది వనమాలియకదా? ఇచ్చటికి భామినిసైతము వచ్చునదిగనున్నది. వనమాలికంటెను తాను

ఘుండరియని విశేషము డాంబికము చూపునుగాఁబోలు. ఇట్టి టాకటీకలతో నారియును నుండి వెళ్లినది, భామిని, కాదుగదా?

చ. చపలగతిన్ బకంబులను జూపుమనోహరలీలనుంచుచున్,
నృపతికుమారియున్ బలెను నీటుగఁగుల్కుచు మోముఁద్రిప్పుచున్
స్వపదసరోజయుగ్మములపై నయనాబ్జయుగంబుఁ జేర్చుచున్
ద్విపగమనానులీలఁ జను దేవతనామనమున్ హరించెఁగా,

( లక్ష్మీధర విలాసధర శీలధరులు ప్రవేశింతురు. )

లక్ష్మీధ:— సేనాపతి యెచటనున్నవాఁడో నాకుఁ ద్వరగఁ జూపుము. నా దేహమంతయు నానందము నిండిపోయినది. వారినెప్పుడు జూతునోయని నామనము త్సాహపడుచున్నది. ఏమండీ విలాసధరగారూ! వేగముగ నడువుఁడి. నావలె నింధుక పఱుగిడుట నేర్చికొనుఁడి.

విలాస:— ఏమండీ; ఇటు పఱుగిడుట కేల? శౌర్యధరుగారి దర్శనమైనతోడనె సకలసంగతులు నేను వారికి మీరు తెలిపినరీతిగ విన్నవింతును.

లక్ష్మీధ:— ఇప్పుడు నాకు ధైర్యమువచ్చెను. ఇఁక నిదానముగఁ బోవుదము.

శౌర్యధ:— శీలధరుగారూ! ఏమి బాబాసాబుగారిని బిలిచికొనిరాలేదు?

శీలధర:— నేను నలుదిక్కుల వారికిఁగాను వెదకితిని. ఎచ్చటను వారు దొరకరైరి. అంతలో వీరు గంటు పడిరి.

విలాస:— కావున నవాయాశముగఁ దమదర్శనము లభించెను.

లక్ష్మీధ:— తమరిచటికివచ్చినారని వినినవెంటనే, యెప్పుడెప్పుడు తమదర్శనము లభించునో యనిపించెను. అబద్ధముకాదు. ఏమండీ! ఏమండీ! శీలధరుగారు వచించిన యొక్క శబ్దమువినినతోడనె మీకను మాకనుఁగల పూర్వవైరమనుఁబోయి మార్గము సరళమాయెను. వారియొక్క శబ్దము తోడనే మాయిరువురికి సఖ్యము కుదిరెను. మైత్రి హెచ్చెను. ప్రేమజనించెను. తమకు రాజకన్య.

శీలధర:— నేనెప్పుడుఁ జెప్పలేదు. రాజకన్యతోఁ దమవివాహము నిశ్చయింపఁబడినదనియు వేగముగ లగ్నసమారంభము జరుగుననియు.

లక్ష్మీధర:— ఆ మాటవినినవెంటనె నాకు నానందమయి యటులనే పఱుగిడివచ్చితిని. నిట్టూర్పు వడలుచువచ్చితిని. ఏమండీ! మేము శ్రీమంతుల మింతటివేగమున నెచటనైనను నడతుమా? యుద్ధములోనైన తము పఱుగిడునప్పుడింతగ నేఁ బరుగిడను. పిడుగునుఁబోలు వేగమునఁ బఱుగిడి తమదర్శనమునకు వచ్చితిని.

శౌర్యధ:— ఇంతటియవసరమునకుఁ గారణమేమి?

లక్ష్మీధ:— రాజకన్యతోఁ దమవివాహము నిశ్చయింపఁబడినది నిజముకదా?

శౌర్యధ:— అవును నిజము.

లక్ష్మీధర:— చాలును. ఇఁక మాయిరువురి మధ్యనుఁ గలిగిన కలహకారణమేదియును నిలువలేదు. ఉత్తరాధిపతితో నెటు మీరు కట్టుబాటొనరించితిరో యటులనే నాతోనున్న భామినీసంబంధములో నట్టి యేర్పాటొనరింపవలెను. అట్టు లేర్పాటుకావలయునని నే నొంటికాలఁపై సిద్ధుఁడుగనున్నాను.

ధైర్యధ:— మీ రేమి చెప్పఁదలంచినదియు నాకు స్పష్టముగఁ దెలుపుఁడి. తమ రలసి యూపిరివిడుచుచున్నారు. కొంచె మిచటఁ గూర్చుండుఁడి, పిదప స్పష్టముగఁ దెలుపుఁడి.

లక్ష్మీధర:— నిజము. నేను గూర్చుండుట మఱచిపోయియుంటిని. ( కూర్చుని ) విలాసధర్మగారూ! నేనించుక విశ్రమించెద. తామే సేనాధిపతిగారితో నా మనవిని విన్నవింపుఁడి.

విలాస:— తమవివాహము రాజకన్యతో నిశ్చయింపఁబడినది. దీనినిగూర్చి యందఱును నానందపడునది సహజమేను. అందఱిలోను లక్ష్మీధరుగారికి విశేషానందమైనది. దానికారణమేమన, వారు భామినిని వివాహమాడవలెనని మనమున నపేక్షించినారు. తమమూలకముగ యాలగ్న మిన్నిదినములవఱకు నిశ్చయమ్ముగాక నిలిచియుండెను.

ధైర్యధ:— నామూలకమున ననఁగ నేమి?

లక్ష్మీ:— ఏమనఁగా? ఏమండీ! బాబాసాబుగారి మనమునఁ, భామినిని దమకియ్యవలెనని యుండినది. భామినిసైతము మిమ్మే పెండ్లి యాడదలంచెను. ఇఁక నన్ను విచారించు వారెవరు? నా వారినిఁ బడినమీములును దొలఁగింప నానావిధములగు నత్తలఁబన్నితిని. మా శ్రీమంతుల యబద్ధములు నెవరిచేతను గనిపెట్ట శక్యముగునా. దీనికిఁగానే, మాకనుమీకును విరుద్ధముగలిగెను. ఇపుడానందమాయెను. సేనాపతిగారూ: ఇదివినుఁడి. నాకు భామినికావలెను. బాబాసాబుగారినిఁజూచి భామినిని లక్ష్మీధరుగారికి నియ్యఁడని మీరుచెప్పితిరేని, మాకనుమీకును స్నేహమునిలుచును. రాజకన్యకై నే రాజుగారు తమవివాహమునకు నెంత ద్రవ్యము సెలవుచేయుదురో యంతకంటె నధికముగ నామిత్రులయెదుట నేను వ్యయము చేయుదును. భామినియును నేనును గూడి తమలగ్నములో నాందీపీటలపైఁ గూర్చుందుము.

విలాస:— నవీన దేవాలయము నిర్మించిన వచ్చునంతటి పుణ్యము జీర్ణోద్ధారణము చేఁగలుగును. రాజకన్యను వివాహమాడి, నూతనగృహమొకటి మీరుఁ స్థాపించునటుల వీరు భామినితోఁ బరిణయమాడినచో నొకజీర్ణమగు నింటిఁ దనము భద్రముగ నిలిపినట్లులయి, తమకు శ్రేయస్సు కలుగును.

లక్ష్మీ:— (లేచి) ఇంతటినుండి నేనెవ్వఁడే గాని యీరీతిగఁ గూర్చుండను. ఈనాపనికి నుత్తమ శకునమగుచున్నది. అదిగో చూడుఁడి, బాబాసాబుగారీ దిక్కునకే వచ్చుచున్నారు, "శుభస్య శీఘ్రము" మ్మనియున్నది. తామిపుడే నాకుఁగాను భామినీ విషయము మాటలు వారియెదుట నెత్తుఁడి.

2-వ ( బాబాసాబు - వినోద - ప్రవేశింతురు )

వినోద:— మహారాజా! బాబాసాబుగారు వచ్చినారు.

బా. బా:-- ఎవరనఁగా? ఇదియేమిచెప్పినది (ప్రేలితోఁజూపును.)

శ్రీధర:— ఏమీ: రాజకన్యయగునీమె యబద్ధము చెప్పెనా?

ధైర్యధ:— ఏమీ: ఈనావనమాల మీతోఁటలో కచేష్టలొనరించెనా?

భా. బా:-- ఔనా భామినియే నాకారీతిఁ దెలిపెను.

భామిని:— నిజము. నేనేచెప్పితిని. ఈ భామిని యెన్నటికి నబద్ధమాడదు;

ఉ. రమ్మని పద్మములందు వృపరాశిను నేనని మ్రొక్కు దాన, నీ
రమణి నీఁ గాఁగనే భవన రాయిడు లెన్నియొ, యుత్సవుండు ని
క్కముగను బీదదాననయి కంటిని నీదయ, భాగ్యగర్వ, మం
త్యముఁగనె నీదు మ్రోల, శుభ దాయక, క్షమ్మ నేను భామినిన్.

ధైర్యధ:— నిజము. భా బా సాహుగారూ! ఇదిపలికిన దెన్నటికి నబద్ధముగాదు. శ్రీమంతజన్మమంది, శ్రీమత్తత్వమునఁ దెలిసి, యుత్కృష్టాచరణచే సర్వులకును. నేర్పుటకునై యీసద్గుణమంజరి లక్ష్మీదేవి యంశమున మంగళదాయక రూపమున ప్రత్యక్షమై మీ భామినిఁగను నావన మాలిగనునా పాణిగ్రహణ మొనరింపఁ జూచినది. దానికి నే నుత్సుకుఁడనై సిద్ధపడితిని.

భా బా:— నాభామిని కరమత్యానందమున మీకొసఁగుచుంటిని. [ అనుచునటు లొనరించును ] ఇదిపాణిగ్రహణము. మహారాజాగారి యాజ్ఞతోరీతి లగ్నోత్సవము రాజధానియందు సత్యధికోత్సవమున జరుపుదము. ఈశుభలగ్నమున నైవముశుభము లిడుఁగాతమని ప్రార్థింతము.

( మహారాష్ట్ర పుస్తకములో లేక క్రొత్తగ జేర్చినది. )

లక్ష్మీ:— విలాసధరుగారూ! వచ్చినపని వానికిటిలోనే యయ్యెను. మాయొత్తుగడ లన్నియును నడుమనే కత్తిరింపఁబడెను. మనపన్నాగములన్నియును సన్నగిల్లెను. మేమొనరించిన కర్మములన్నియును బూడిదలోని హోమమయ్యెను. అయ్యో, నాయెదుటనే, నాకంటియెదుటనే, నా భామినిని నాసర్వప్రాణములని యనినమ్మిన భామినిని వాఁడీడ్చికొని పోవుచున్నవాఁడే? నాకుఁగాళ్లాడవు, పదములులేయవు, శరీరముభారమాయెను. సొమ్మలంకరంటెను భారమాయెను. నా శ్రీమంతత్వము చెడెను. [ అనుచుఁగ్రింద దొర్లును ]

విలాస:— లక్ష్మీధరుగారూ! ఇటుచేయవలదు, నగుఁబాటగును. ఈభామిని లేకపోయిన మఱియొక భామిని ప్రపంచమున లేదా? నేనెచటనైనను దెచ్చిమీకుఁ బరిణయంబొనరించెద. లెయ్యుఁడి.

లక్ష్మీ:— ప్రపంచమున నింకను భామినులున్నవారా? అటులయినసరి. ఈభామినీ లగ్నముననే యా భామినీలగ్నము నాతోఁగావలయును. అటులైనదీనిపై నాకుఁగల వైరముతీరును.

విలాస:— అటులనే కానిరండు. (వెళ్లుదురు)

( శంకరాలయములోఁ ప్రార్థన )

[ సమాప్తము ]

# ప్రకటన.

బళ్లారిలో వకీలుగానుండి కీ. శే. కోలాచలం శ్రీనివాసరావుగారిచే రచియింపబడిన యీక్రింద వివరించిన ఉపన్యాసములన్నియును విక్రయమునకు సిద్ధముగనున్నయవి.

| | | |
|---|---|---|
| 1 | భారత భగవద్గీతలనుగురించిన విమర్శనం | 0 - 8 - 0 |
| 2 | వ్యవహారకర్మజిజ్ఞాసము | 0 - 8 - 0 |
| 3 | అర్జునవిషాదయోగము | 0 - 8 - 0 |
| 4 | సాంఖ్యయోగము | 0 - 12 - 0 |
| 5 | కర్మయోగము | 0 - 8 - 0 |
| 6 | జ్ఞానయోగము | 0 - 8 - 0 |
| 7 | కర్మసన్యాస మంత్రలయ హఠ రాజ యోగములు | 0 - 12 - 0 |
| 8 | ధ్యానయోగము | 0 - 12 - 0 |
| 9 | విజ్ఞానతారక బ్రహ్మయోగము | 0 - 8 - 0 |
| 10 | రాజవిద్యా రాజగుహ్య విభూతియోగములు | 0 - 8 - 0 |
| 11 | విశ్వరూప సందర్శన భక్తియోగములు | 0 - 8 - 0 |

| | | |
|---|---|---|
| 1. | ఆర్యుల నాగరికతవారి ప్రపంచవ్యాపకత. | 0 - 8 - 0 |
| 2. | ఆర్యుల చరిత్ర, ఋగ్వేదభాష మొదలగునవి. | 0 - 8 - 0 |
| 3. | ఋగ్వేద విభజన వేదకాల విభజన మొదలగునవి. | 0 - 8 - 0 |
| 4. | ఆర్యులుపంచాబు చేరిన విధమువారిశాసనము. | 0 - 8 - 0 |
| 5. | మద్యపానము జూదము స్త్రీలగుణములు మొదలగునవి. | 0 - 8 - 0 |
| 6. | వివాహకట్టడములు ... | 0 - 8 - 0 |
| 7. | జాతిచట్టములు ... | 0 - 8 - 0 |
| 8. | సృష్టిని గురించిన తాత్పర్యము. | 0 - 8 - 0 |
| 9. | వేదమతము నాస్తికమతము ఆర్యులదైవములు. | 0 - 8 - 0 |
| 10. | నరమేధ అశ్వమేధాది యజ్ఞములు. | 0 - 8 - 0 |
| 11. | అదితి ద్వాదశాదిత్యులు మొదలగునవి. | 0 - 8 - 0 |

| | | |
|---|---|---|
| 12. | యమ యమి పృశ్న్యాది పితృదేవతలుకన్న మొదలగునవి | 0 - 8 - 0 |
| 13. | సోమపానము అశ్వినులు రుద్రుఁడు పర్జన్యుఁడు. | 0 - 8 - 0 |
| 14. | ఋషులు సప్తర్షులు దధీచి; చ్యవనుఁడు మొదలగునవి. | 0 - 8 - 0 |
| 15. | ఋగ్వేదములోని ముఖ్యప్రార్థనలు. | 0 - 8 - 0 |
| 16. | మతవిధులేరీతిగఁ బ్రబలినది ... | 0 - 8 - 0 |

కావలయువారు ఈ క్రింది చిరునామాకు వ్రాయవలయు.

కె. శతృఘ్నరావు,

సివిల్ లైన్సు, బళ్లారి.